అస్మద్గురుభ్యోనమః





హరివిలాసము

# గణోదయము.

అను

## శిలాపనిందానివారణము

ఇది

శ్రీగోదావరిడిష్ట్రిక్టు రామచంద్రపురము తాలూకా కొమ్రి
వాస్తవ్యులును, ఆశ్వలాయన సూత్రులును కాశ్యప గో
త్రులును, "అభినవ పోతరాజ" బిరుదాంకితులును

అగు

శ్రీమాన్ "చిలకమర్తి నారాయణకవి" వరులచే

రచియింపఁబడి

యేతత్సూనులగు

శ్రీమాన్ "చిలకమర్తి నరసింహాచార్యులు" వారిచే

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు, 500.

COCANADA:
Printed by B. C. Surya Row, at the
Saraswati Printing Press.

 1913. [వెల 4 అణాలు.

అస్మద్గురుభ్యో నమః..

(హరివిలాసము)

# గణోదయము

అను

నీలాపనిందానివారణము

ఇది

శ్రీగోదావరిడిస్ట్రిక్టు రామచంద్రపురము తాలూకా

కొమరపురివాస్తవ్యులును, ఆశ్వలాయన సూత్రులును,

కాశ్యప సగోత్రులును,

"అభినవ పోతరాజ" బిరుదాంకితులును;

అగు

శ్రీమాన్ "చిలకమర్తి నారాయణ కవి" వరులచే

రచియింపఁబడి

యేతత్సూనులగు

శ్రీమాన్ "చిలకమర్తి నరసింహాచార్యుల" వారిచే

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

(మొదటికూర్పు ౫౦౦ ప్రతులు.)

COCANADA:

PRINTED BY B. C. SURYAROW AT

THE SARASWATI PRESS.

1913

 [దీనివెల 4 అణాలు.

# పీఠిక.

---

## చిలకమర్తి నారాయణాచార్యులవారు.

వీరు శ్రీవైష్ణవులు. 19 వ శతాబ్దములోనివారు. గోదావరిజిల్లా, రామచంద్రపురముతాలూకా, కొమరిపాలెపువాస్తవ్యులు, శ్రీమాన్ పల్లేరుమూడి వెంకటాచార్యులవారియొద్ద విద్యాభ్యాసముచేసి, గీర్వాణాంధ్ర సాహిత్యము, ఉభయభాషాకవనము, స్వరపదవర్ణ కవిత్వము, జ్యోతిషము, వైద్యము, ఉభయవేదాంతజ్ఞానము, మొదలగుననేక విషయములలోఁ బాండిత్యము సంపాదించినట్లు తమగ్రంథములయందు వ్రాసియున్నారు. వీరు (1) గణోదయప్రబంధము (2) భాగవత దశమస్కంధ పూర్వభాగమంతయు, యక్షగానము, (3) శ్రీవేణుగోపబాలశతకము, చక్కఁగా స్వభావోక్తి ననుసరించి సరస, మృదు మధురశైలిని నిరర్గళధారగా వ్రాసినారు. (1) (3) గ్రంథములు కొమరిపాలెపు శ్రీవేణుగోపాలస్వామివారికిని, (2) గ్రంథము ఆయన అత్తవారిస్థలమగుతణుకుతాలూకా దువ్వగోపాల స్వామివారికి నంకితముచేసిరి. యమకకవిత్వము వీరిసొమ్మైనట్లు పైగ్రంథములే తార్కాణములు. వీరు "అభినవపోతరాజ" బిరుదాంకితులు. 'కీరవటనారాయణసూరి' యని గ్రంథములలో తమపేరు వ్రాయుటకలదు. వీరుసంచారకవులు. అందందువీరువినిన క్రొత్త దేశీయపదముల నక్కడక్కడ తమకవిత్వములోఁ జేర్చిరి. వీరుతమ గ్రంథములను జదువునపుడుఅమృతముకురిపించి, పూలజల్లులుచిలికించి జనులనానందమగ్నులఁ జేసిరను వాడుకకలదు. వీరికనేక విషయములలో గొప్పలోకానుభవమున్నట్లు' వీరువ్రాసిన గ్రంథములవలనస్పష్టమగుచున్నది. వీరు చాటుధార లనేకములు రచించియుండిరి. వానిలోఁదమ పొలమునందు 'తృణరాజి' మెండుగానున్నదని యధికారులతోఁ జెప్పు సందర్భములో నీక్రింది 'చాటుధార' ను జదివిరి.

### తృణరాజిసీసమాలిక.

అమడతుత్తురు బెండ ♦ యత్తిపత్తి గునుకు ♦ గాడిదెగడపరి ♦ కాణి వేప
యుట్టెంక దూసరి ♦ యులిశ పావలి యుప్పి ♦ యూరుగ పెదచిప్ప ♦ కారుగెచ్చ
గాంధారి చినచిప్ప ♦ కాకిచిప్ప గరికె ♦ రెల్లు చెంగలి దర్భ ♦ తెల్లయూద
పిప్పలి యొబిళింత ♦ పిల్లిపీచర గుంట ♦ కర్ణ చేలవురి పొ ♦ గాకు జోడె
కోడిబుడమ యలకా ♦ జీడి కాసరి నల్ల ♦ యూద కడిమి చిట్టి ♦ యుత్తరేణి

ii. రుక్మిణీకల్యాణములోనిది:—

ద్విపద. ధరణి రత్నపుపేట ♦ భవములవేట
గరిమతువాట శ్రా ♦ గములలోనాట
హరినామములపాట ♦ యఘములమీట
సరవి వైరులకోట ♦ జాళువాతేట
పుడమియేలికబాట్ల ♦ పూబంతులాట
కడుకుందనపుపీట ♦ గజ్జెరుతోట
పవడాలకోట పెం ♦ పగుబొన్నలేట
నవరత్నములమూట ♦ నాదగుమాట
యిట్టి నామాటచే ♦ ననుహరమనుచు
గట్టిగా శ్రీకృష్ణ ♦ కథవినిపింతు
వినరయ్య సభికులు ♦ విస్మితులగుచు
ఘనతనాకథ యుక్తు ♦ గానమైయుండు
అవనిఁదెలుఁగున నా ♦ రాయణసూరి
కవనొప్ప చేయుచు ♦ గానంబునగుచు
మహింపహా నలుపకొ ♦ మసగ్రంథమునను
సహింతవృత్తిగ రుక్మి ♦ ణీదేవి పెండ్లి
కథనెల్ల వినిపింతుఁ ♦ గనివినిమీరు
సుభగాంగ భావించి ♦ చూడంగవలయు.

శ్రీవేణుగోపబాలశతకము (తూటిపుడుగు శతకము) లోనివి:—

అశ్నంబు బసువెక్కి ♦ నటిగని యోటయుఁ ♦ దగి కనుగానవారు ♦ దేగినదూది
సుతిగించక పటికె ♦ ర్బుటగల కొన్నిగ ♦ జిలుగుపోఁగడనిద ♦ స్ఖలకట్టు
కాకచల్లాగ్ని ♦ కమ్మరిలోహంబు ♦ కాకచల్లాగ్ని ♦ కంచరంబు
చిలురాలు మృత్తుచే ♦ శిఖిలి చిల్లైడుగాజు ♦ కరములోఁగొనవర్తి ♦ కంపు సరకు
కరఁగి చమురున నిడని బం ♦ గరమువెండి । పలకబల్ల లకినిగనట్టి ♦ తిలల గాద్గ
యేటివరి కాపురమునుండ ♦ నేకమె కద । కోమరపురిపాల శ్రీవేణు ♦ గోపబాల.

భూసురద్రవ్యంబు ♦ భూమిసురులపాలు ♦ రాజధనము మంది ♦ రములపాలు
వైశ్యులధనము వి ♦ వాహోత్సవము పాలు ♦ కాపులధన మధి ♦ కారిపాలు;

మద్యపాయులసొమ్ము ♦ మహి నీడిగెలపాలు ♦ జారులధనము త ♦ లారిపాలు
గురువులద్రవ్యంబు ♦ కూలిజనులపాలు ♦ సంసారిసొమ్ము వె ♦ చ్చములపాలు
వ్యాధిజనుసొమ్ముపారుగూరి ♦ వైద్యుపాలు । లుబ్ధునిధనంబుబలిమిదం ♦ డుగులపాలు
మాధనము గోడమెరక కా ♦ మట్టిపాలు । కోమరపురిపాల శ్రీవేణు ♦ గోపబాల.

## కీ ర న లు.

### రుక్మిణీదేవి గావించిన "అంబాప్రార్థన."

ఆనందభైరవిరాగము ♦ చాపుతాళము.

ఆననా జితేందు బింబ । ఓయంబ । అమిత గుణకదంబ । ఓయంబ॥

౧ వల్లవీచేల చోరుఁడె । ఓయంబ। వాఁడునల్లనీ దేహమువాఁడె॥ ఓయంబ॥
౨ నందతనయుని తోడితెమ్మ ।ఓయంబ। తెచ్చి। నాథునిగఁ జేయవమ్మ॥ ఓయంబ॥
౩ బృందావనవిహారుఁడె । ఓయంబ। వాఁ।డెందుకు నన్నేలుకొనఁడె॥ ఓయంబ!
౪ దుర్వ్యగోపాల రాయఁడె ।ఓయంబ। వాఁడు।రవ్వకు నోడిగట్టినాఁడె॥ ఓయంబ॥

శంకరాభరణము ♦ అటతాళము.

తెలియఁగలమ । నీదుమాయ॥

౧ హరి నీకడుపులోన ♦ నజ్జాండములఁట ♦ గరిమతో దేవకి ♦ కడుపులోనీవఁట॥ తెలి॥
౨ నలినాక్షునీవాది ♦ నారాయణుఁడ వఁటయా ♦ చెలియగర్భములోన ♦ శిశువైయు
న్నావఁట॥ తెలి॥
౩ వనరుహాక్షుఁడ నీకు ♦ వైకుంఠ మిల్లఁట ♦ ఘనమైన మధురాన ♦ గరమి ప్పుడిల్లఁట। తె
౪ విశ్వమునకు నీవు ♦ వేఱైనావఁట ♦ విశ్వముదలఁపఁగ ♦ వేఱులేదఁటమాయ ॥ తెలి॥
౫ జలజనాభుఁడవఁట ♦ శార్ఙ్గివినీవఁట ♦ పలుమాఱుదుర్వ్యగో ♦ పాలుఁడవఁటచూడ

కాకినాడ
4-9-1913

ఇట్లు,
కవీశ్వరుని దౌహిత్రుఁడు,
శ్రీవైష్ణవలోకప్రపన్నుఁడు.
సంస్కృతాంధ్ర భాషాభిమాని,
అమరవాది వెంకటాచార్యులు.



# శుద్ధపత్రిక.

---

| పేజీ. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 23 | యార్య | మార్య |
| 10 | 24 | గేరేడి | గేరెడి |
| 10 | 27 | కేరసం | కేసరం |
| 11 | 1 | చ్చ్బడి | లిచ్చ్బడి |
| 12 | 3 | గొమ్మ | గొమ్ము |
| 14 | 17 | కుండ వేసెను | కుండె నేసెను |
| 25 | 20 | బాపి | బాసి |
| 26 | 7 | గలువలు | గలువల |
| 27 | 10 | నంచుద్ర | వంచుద |
| 28 | 20 | యానమన | యానమున |
| 34 | 14 | యొవ్పగ | యొప్పగ |
| 35 | 5 | తవ్వున | తప్పున |
| 40 | 25 | సచ్యదన | స్యందన |
| 41 | 3 | నఁదనందను | నందనందను |
| 42 | 26 | మోదఁబున | మోదంబున |
| 45 | 20 | కలినిత | కలిత |
| 46 | 2 | శార్గి | శార్జ్గి |





శ్రీమద్గురుభ్యోనమః.

# గణోదయము.

## ప్రథమాశ్వాసము.

ఉ. శ్రీలని భక్తిమెప్పిక్కొదన ♦ వారణ వారణవేషనాటవీ
కేలికి విశ్వసంభరణ ♦ కేలికి దుర్మద దైత్యదానవో
న్మూలికి శాంతశీలికి బ్రి ♦ మోదగుణాలికి భక్తపద్మగో
మాలికిఁ బ్రీతశూలికి సు ♦ మాలికి నవ్వనమాలి కెప్పుడున్. 1

ఉ. రాణవలిప్పు భక్తిని గ ♦ రంబులు మోడ్చెదఁ జారుస్మైకత
శ్రోణికిఁ జంచరీకచయ ♦ సుందరవేణికిఁ బల్లవప్రభా
పాణికి జంఘికావిజిత ♦ భావజతూణికి దివ్యభూషణ
శ్రేణికిఁ గీరవాణికిఁ బ ♦ రీతదృగేణికి వాణికెయ్యెడన్. 2

శా. పారాశర్యుని వామలూరుభవునిన్ ♦ బాణున్ మయూరున్ శుకున్
జోరున్ భారవిఁ గాళిదాసుఁ జరణా ♦ త్మున్ మాఘునిన్ నాఘునిన్
ధీరున్ త్ర్యంబకు దండి భోజు భవభూ ♦ తిన్ శంకరున్ మున్నుగా
నారాధించి మదిన్దలంతు సురభా ♦ షాంచత్కవిశ్రేష్ఠులన్. 3

ఉ. నన్నయభట్టు తిక్కకవి ♦ నాచనసోమన పోతరాజు పె
ద్దన్నయుఁ బాండురంగపతి ♦ తాతయ తిమ్మన భాస్కరుండు సూ
రన్నయు నెఱ్ఱయాప్పకవి ♦ రామకవీంద్రులు మొల్ల వేర నా
యన్నవ లోను గాఁగలుగు ♦ నాంధ్రకవీశ్వర కోటినెంచెదన్. 4

వ. అట్లు గొనియాడి యేనొక్కదినంబునఁ దొవలనేచువాఁడు ప్రాచీశైలోపరిఁ దోఁచు వేళ లేచి యాచరితాచారుండనై ప్రాచీనకథానుసారంబై భూచక్రంబున సమీచీనంబుగా నొకచరిత్ర రచింపంజూచి యాధారంబుదోచక మది నాలోచించుచున్నెడ

నోఁచిన! తపమ్ముగల యాచకులకు ముక్తి నీఁజాలదు పద్మలోచను నమగునఁ బుట్టు ఖేట
కీపీపీవతి నీచమానవ పాపాపహా గా నెత్తి మోచుకొనెడు మేచకేతరాబ్ధికిం బట్టియ
గు మాదకోరాత్రికిఁ దోఁబుట్టు సితిరోచి నే తల నాచుకొనెడు పార్వనేత సస్తుతా !
నీచాపదాన మారీచాది శిక్షాచణా ! వాచాత్యగోచరా ! మరీచి స్ఫురన్మణీ రోచమా
న విభూషణా ! సూచీముఖోగ్రాదభ్రాప్రచార ! ధీవిజిత వాచస్పతిప్రిక్రమ !
భూచార దేవాళికీచకజ్వలన ! సద్వీచీ భుజావిక్రమ ! యను నుతులఁ బ్రోచిన సా
మిషేరు పాప్రిదుర్యగతి వదించె. అట్టిబూచుల యొకిమీనికిం బట్టియయిన పాట్టివేల్పు
చరితము చూచాయగా నాధారంబై దోచ నాదకాచక రచింపఁజాలదు నాచేత ని
ట్టి కవితావాచాలత్వం బెల్లు దోచునని యాచియున్నంత. 5

సీ. తనకు లోకము; శిశు ♦ త్వంబునఁ గను మేటి, ; తా దేవకికి శిశు ♦ త్వంబునొందె
సురముసీందుప్రియకరో ♦ చరత జెంచెడిసామి, ధరణి గొల్లలకుగో ♦ చరతఁ జెందె
జగములఁ బెంపంగఁ ♦ జాలిన జగజెట్టి, గొల్లలు పెంపుచే ♦ గొరలఁబడసె
క్షీరాబ్ధిభవనంబుఁ ♦ జేసెడి బలుమేటి, నందవ్రజము భవ ♦ నంబుఁ జేసెఁ
జట్టుపలుగొట్టు జెట్టితో ♦ బుట్టు మెట్టు, చుట్టువాలును జేపట్టు ♦ నట్టిదిట్ట
కొమరపాలెపు పురివేణు ♦ గోపబాలుఁ, డట్టినిశినాడు కలను జూ ♦ పట్టిపలికె. 6

సీ. ఆశ్వలాయన సూత్రు ♦ మమరకాశ్యపసగోత్రుఁడవు నారాయణా ♦ ర్యుఁడవు చిలక
మఱ్ఱివంశజుఁడవు ♦ మణవాళ్ళవేంకట గురుశిష్యుఁడవు శాస్త్ర ♦ కోవిదుఁడవు!
వేమకఁబల్లేరు ♦ మూడివేంకటగురు నొద్దవిద్యాభ్యాస ♦ మొందువాఁడ
వెపుడుమునొంది మరపా ♦ లెపుఁబురమునఁ గాపురంబుండుదువు పాప ♦ రహితమతివి
ప్రబల తుల్యాజలస్నాన ♦ పానమునను, వెలయుచుందువు వేణు గోపాల ♦ విభుని దయను
గీర్తితగుణాఢ్య మరవాది ♦ కృష్ణమార్య,! సూరిజనమాత నౌదువు ♦ దారమతివి. 7

క. శీరస్వాంత జనార్దన, శ్రీసరివిహృదయంబుగ ♦ దేశమునర్చిం
నారాయణరామానుజ, భూరియశః కృష్ణయార్య ♦ పురుషత్రయమున్. 8

క. ఆనారాయణవరునకు, సూనుండు, జనార్దనుండు ♦ శుభగుఁడు పుట్టెన్
మానుగ నమ్మేటికిఁ బెను, సూనుఁడు వేంకటనృసింహ ♦ శుభగుడు పొడమెన్. 9

శా. కాణాదంబును బాణినీయమును ♦ గాఁగల్గు శాస్త్రంబులున్
క్షోణీపాల సభాంతరంబుల మహా ♦ సూరీంద్రులం గెల్చి తత్

క్షోణీపాల సమర్పితాంబరవర ♦ క్షోణీమహాఁదోళికా
మాణిక్యాది బహూకృతిఁబడసి న ♦ మ్మాన్యుండు సామాన్యుఁడే. 10

క. ఆమాన్యునకనుజుఁడవై, సామాన్యంబుగను నీవు ♦ జన్మించితివే
నీమహిమ నీమవిద్యయు, నీమన్నన నీకుసాటి ♦ నీవెయగుసుమీ. 11

చ. సరసపదార్థకల్పనలు ♦ సద్యమకంబులు సాంధ్రశబ్ద సుం
దరమహితప్రయోగము ల ♦ శాంతమృదూక్తులు శ్లిష్టరూపశ
బ్దరమ లలంక్రియా కలిత ♦ బంధములున్ సురశబ్దసంతతుల్
మఱిమఱి నీకవిత్వమున ♦ మక్కువఁ దామర తంపరై తగున్. 12

తే. త్వన్ముఖోద్గీర్ణయమకశ ♦ బ్దకవనరమ, బాగుకొనలేరె యెందునై ♦ పుణిసిగించి
రామభాస్కరనాచన ♦ సోమనాది, కవివరులటంచు నావారి ♦ కనుమొఱంగె. 13

తే. అత్తఱి నిలేచి క్రొత్తయౌ ♦ తత్తరంబు, జొత్తిలఁగ సంశయంబుల ♦ మొత్తములను
మొత్తియగ్గిత్తత త్తడి ♦ యుత్తమసుతు, సత్తుఁదళుకొత్తఁ జేయుచు ♦ తాసహమంది

క. ధరవైష్ణవదాస్యంబను, తరిగట్టున గవనజలధిఁ ♦ దతబుద్ధిఘణీ
శ్వాసుచే ద్రచ్చి శృంగా, రరసామృతమును సుకవిసు ♦ రలకర్పింతున్. 15

తే. ఆంధ్రసంస్కృతాలంక్రియల్ ♦ యమకతద్భవములు కల్పనల్ శ్లేషప ♦ దములు తత్స
మాసములు లోకరోకరికి మోద ♦ మూనుఁగాన, మత్కృతి వారి వారి ప్ర ♦ మదమొనర్తు.

——షష్ఠ్యంతములు.——

క. దక్షునకు సితాంభోజద ♦ ళాక్షున కరిశిక్షునకు రమాంబుజనేత్రా
వక్షునకు సర్వభువనా ♦ ధ్యక్షునకుఁ గిరీటి పాలితకటాక్షునకున్. 17

క. నమదాశ్రితలోలునకున్, రమణీయసువర్ణ విస్ఫు ♦ రచ్చేలునకున్
శమితాసురజాలునకున్, గోమరపురీపాల వేణు ♦ గోపాలునకున్. 18

క. రామునకు సతతనుతసు, త్రామునకు సునామునకు వి ♦ దారితవైరి
స్తోమునకు సర్వమంగళ, ధామునకు సుధామునకుఁ బ్ర ♦ ధనభీమునకున్. 19

వ. భక్తియుక్తంబుగా నాయొనర్పంబూను గణోదయ ప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టి
దనిన. 20

క. విమలాశ్రమముల నెరవై, తుములంబుగఁ బలుకు మునుల ♦ దొరలకు నిరవై
కమలాధవాశ్రమంబన, నమరుఁ దపోవనము నైమి ♦ శారణ్యమనన్. 21

తే. రాజహంసాభిరామమై • రాజరాజ, పురమును నభస్స్థలంబును • బోలె వనము
దివ్యవాసనా*సుమనఃప్ర • దీప్తమగుచు, దేవపురమన నభయానఁ • దేజరిల్లి. 22

వ. మఱియుఁ దెలిగంటుల తెలివు నొఱసికొను కొమ్ములుగల తరువరమ్ముల యిరవులు మరువులుగాఁ జూచుచు మరువిరిశరముల జరుగు గరుసుమురమునఁ బోరిఁబోరి బిరుసుఁదొలఁగి బిరబిరమరలుకొని వెలఁచఱచి కరకరినిమరుశరణంబునఁ దిరుగు తెలివలతులుముల నెఱిపిరులు మఱిమఱియురుల వీచుచు సగసుసురఝరి స్నానోహార కరివర వరకర శీతహృత మరుమురు గతులఁ దఱలు తరఁగలగములఁ బొరలు సురుచిరశిశిర పరిమళ భరభరిత సరస్సరసీరుహముల నరమురిఁ దిరిగి తిరిగి యాడుచుఁ జౌఱకు వింటిదొరదానవెఱికి చుఱుకుచుఱుకుగ్రొవఁ బఱపు కఱకు విరిశరములురమునఁ గరప వరవిరహభర ఖరతర శరధిగడవఁ దరణి నరయక పరిపరిగతుల తరతరంపు తెరగరపి కరుగుమనముల దరిదరికరుగు వెరవరులగు తరుణులకుఁ దిరమగు నాశయంబులు మరుగుపఱచి మురి దరిగి పొరలి పొరలి వేదనల నొరుగు విరిబోణులనేఁచుచు జిరజిరఁ దిరిగెడి చిఱుతె కరువలులును వనస్పతి యాగశాలల తిర్యక్ఛాఖా పీఠంబుల పయినుండి యూర్ధ్వశాఖాయూపంబులు మెఱయ లతాదర్భాస్తృతంబైన మొదిజివురు జొంపం బను వేదికను కావిలేజిగియగ్గిదరికొల్పి పారావత బ్రహ్మల కోకిలాధ్వర్యుల చక్రవాకహోతల కురువకోద్గాతల యన్యద్విజగణ బుత్విగ్గణంబుల వాక్షంత్రంబులు మొరయఁ జాంపు పత్రపాత్రిలచే ఫలరసాజ్యంబున నాపాస్రుక్స్రువంబుల ఫలఖండ పశువులనిజ డింభ దేవతాతృప్తిమెలర్ప మరంద భోజనంబునం దృప్తులై భ్రమరవిప్ర వర్గంబులు విహరింప వ్రేల్చి సవవిధిమెలఁగు శుకయజ్వలు నితరపక్షికులకుల శేఖరాదులతోఁ బరివేష్టించు పారావత దైవంబులుగల పున్నాగకురంటకముఖతరు దేవాలయంబులలోఁ బల్లవప్రభాదీపంబులును బరాగ పరిమళధూపంబులును నానాఫల నివేదన వస్తువులను మధుతీర్థంబుగా మధ్వర్చనాధికారి యర్చాక్రమంబు సలుప నీటనాడి వెడలిన వైఖరిఁదరుజొంపంబునవెడలి క్రముకనారికేళ తరుస్తంభంబుల కడ్డంబుగాఁ బ్రాకు నేతాలవంగలతా కాయమానమంటపంబులవసించి ముఖశైవలోర్ధ్వపుండ్రంబునలమి కంఠసీమ సహస్రకమల ధాతులైశరీరారుణిమ మను కాషాయవస్త్రంబులుగట్టి నానా సుమవ్యాప్తభూములను చిత్రాస్తరణంబుల నన్యోన్యాభిముఖాసీనులై ద్రవిడాను సంధాన నాందిని నమ్రులై సేవించిన క్రియవాయుగతుల శిరంబులు వంచుచు మున్నుడి పిన్నడిగ వెనక ముందుపలుకుచు జిలిబిలిపలుకులను ద్రవిడంబను సంధించు కురరవై

ష్టవాధ్యాపక గణంబులును ఫలగుచ్ఛక కుంభంబులుగల శాఖాపీఠలపైనున్న బెరడు సారెలపైఁ బ్రాకుఁ గనులతా తంత్రులు స్వబ్వర్గ వాత చలిత శాఖాతాడితంబులై నిజకరంబున మేళనస్వనం బొనరించెనన షడ్జమంబునం బాడు నప్పాటకు ఘణులరుదెంచి యనుకూలంబుగామి మరలు తెమ్మెరలు భీతి నచటి సరసీమధ్యంబునం బ్రవేశింప వారిజ బిసభృంగకోకవారిచరంబులు సహజ సంబంధంబులం దల్లడిల్ల డిండీరహాసంబున సరసీనితంబినీనయనాది సంజ్ఞలఁ దదనుకూల నాట్యంబొనరించెనన స్వగానాదరీభూత గాంధర్వగానులగు నీలకంఠవైణికులును వనీస్థలంబులు రంగస్థలంబులుగా పికనిస్వానంబులు వైతాళిక గానంబులుగా వంశసుషిర నినాదంబు లుపాంగంబులుగా శకుంతభాషణంబులు తాళఘోషణంబులుగా పతయాళుపాండుపత్ర నిస్వానంబులు మృదంగధ్వానంబులుగా పుష్పిత తరుతతులు సభాపతులుగా తాపింఛకుజనులగమి తమిగా పూలపరాగంబను హరిదంతరజంబున వేషంబులు దాల్చి యరుణ పల్లవ ప్రభలను కరదీపికల వాయుచలితఫలకాంతి గుగ్గులు రజంబు ప్రజ్వరిల్ల లతాయవనికా నిర్గతులై ఘూకపరిహాసకులతోడ నాదగీతంబులు బాడుచు భాగవతంబుజేయు భృంగీ భృంగంబులును, పదక్రియ విరాజితులగు హంసఛందోవేదులును, పంచబాణ రసోత్పాదన చణులగు ఋతుభిషగ్వరులును, ప్రసవఫల సూచకులగు కోకిల దైవజ్ఞులును గలిగి లంకాపురంబు కరణిఁ బుణ్యజనసేవితంబై మానసకాసారంబు భాతి రాజహంసయుతంబై కౌరవాయోధనంబుక్రియ నకులార్జున బాణ కదంబ స్యందనాశ్వకర్ణంబై స్వర్లోకంబు కరణి రంభాసుమనోవృతంబై దిగంతంబు తెఱంగునఁ గుముదపుండరీకంబై కలధౌతాచలంబుక్రియ నీలకంఠ సహితంబై యొప్పి మఱియును. 23

సీ. సారమై బహుళ కా ♦ సారమై చ్యుతసుమా, సారమైధూత సం ♦ సారమగుచుఁ
బుణ్యమై పుష్పితా ♦ రణ్యమై భూరిలా, వణ్యమై యెన్న న ♦ గణ్యమగుచు
భవ్యమై మునిహుత ♦ హవ్యమై ద్విజరాజ, సేవ్యమై సుజన ♦ సంభావ్యమగుచు
రామమై నందనా ♦ రామమై మానీంద్ర, ధామమైవిపినల ♦ లామమగుచు
సకల శుకపిక శారికా ♦ నికరనిలయ, వకుళ మరువక కుంద తిం ♦ దుకకురంట
వికచ కుసుమ రసాశిమ ♦ ధుకరతతుల, చకచకలు గల్గునవ్వని ♦ నికరమునను. 24

సీ॥ తోరమ్ములైనమ ♦ హీరుహమ్ములలోనఁ ♦ జేరికొమ్మలమూరు ♦ గోరికలును
గోరికలకుమీఱి ♦ గోరికలకుమీఱి ♦ సారఫలాదులౌ ♦ కీరములును

కీరమ్ములను జేరి • చారుపల్లవములఁ • గోరి మెక్కెడి పిక • వారములును
వారమ్ములుగఁ గూడి • బైరికలట్లుగా • నూరక నూదుమ • యూరములును

తే. గలిగి పొలుపుగఁ దరువులఁ • గలయ ఫలరుల, వలనఁ జిలుకుచుఁ దావుల • కలిమిగలుగు
లలిరజము జిమ్ముగా ద్పుపి • ల్లలకిలయయి, తెలయు నలవనిలో నొక • తలమునందు. 25

తే. కశ్యప వశిష్ఠజమదగ్ని • గౌతమాత్రి, కౌశిక వ్యాస శుక శౌన • కకలశభవ
వామదేవాది మునులుదు • ర్వారనియతి, నున్నత తపంబొనర్చుచు, • నున్నయెడను.

క. ఘననూతేందుఁడు బోడమెన్ • దనకరనూచనను లోక • తమమణఁచి జనా
ర్దనచరితా మృతనిధియై • మునిముదుదధి పొంగినింగి • ముట్టి చెలంగన్.

క. క్రిందటఁ దావకముఖుని • ష్యందహరికథా సుఫలర • సాస్వాదమహా
నందాస్మచ్ఛ్రితిశుకవర • బృందము తనివందదిల న • భిమతఫలాప్తిన్. 27

క. ఇంసుధరుకై గజాసురుఁ • డొందుకుఁ దపమూని మడిసె • నెందుకతనిచే
నిందున కందెను నిందన • డెందుకుడింపంగ జేసి • నిందుధరుఁడనన్. 28

వ. మఱియు మున్నీటి చిన్నికన్నియ వన్నెలాడగు వెన్నుని మన్నవల నున్నతిఁ గాం
చి యున్నింటిలిండికాఁడు కన్నుగల మిన్నువాఁకఁ దాల్పు పాపని చిన్నెలుగలయొ
క్క యెన్నికకథయున్న యది దాని నెన్ని పరిపన్నలు భవంబున బన్నంబులు
మీఱి శ్రీశు నున్నత నిలయంబునం జేరఁ గన్న విన్న జనంబు లన్నన్నాయని గేర
తిన్నని నూక్తులఁ బన్నికరిన్నన విన్నపంబు జేసెద. 29

తే. పావనాయన తేభాధి • పావనాయ, కారణాయ కృతర్త్విగా • కారణాయ
ధీవరాయ భవాంబుధి • ధీవరాయ, తేన మోస్తని కొనియాడి • ధీరమతిని. 30

వ. చిత్రింబు భూపవిత్రంబు భవలతాలవిత్రంబీ చరిత్రంబు శ్రీదంబు జనతమోభేదంబు
సన్మనోమోదంబు సుజనపరిసాదం బివ్వాదం బాదరం బునవినుండని శుంభత్సంరంభ
విజృంభణాస్తంభ శుభదంభావుక కుంభీనస జంభారి శయాంభోజాతుపదంభోరు
హాభక్తి సంభావనుండై యిట్లనియె. 31

క. దంతావళి దానవుఁడా • ద్యంతంబులు లేనియంత • కాంతకుని నిజ
స్వాంతమున నునిచి యుతిదు • ర్దాంతంబుగఁ జేసెఁ దపమ • త్యాంతకిరియలన్. 32

క. తనుతను తపోనియతిచే, తనతను వైరితశుకిభురి • తనుగనరామిన్
దనుకృశశను వంతనొకిం, తనుజెందక తపమునియమి • తనుజేయుసెడన్. 33

సీ. తోరమ్ములైన మ ♦ యూరారవమ్ములు, వీరకాహళరవో ♦ ద్వృత్తిగాఁగ
ఘోరమ్ములౌ స్తని ♦ తారవమ్ములుమహా, భేరీరవమ్ముల ♦ సౌరుగాఁగ
సారమ్ములౌజ్వల ♦ వైరమ్మదస్ఫూర్తి, లారూఢిదివియల ♦ బారుగాఁగ
నీరమ్మునందంగఁ ♦ జేరుచాతకముల, పౌరమ్ములౌపరి ♦ వారములుగ
ధారుణీపతి గతిశరా ♦ సారమునను, సారెసారెకు గిరిస్థారి ♦ పాఱియువతి
సారవత్కోజదుర్గము ♦ దూఱిదాఁగ, గాలిమొగులంబరముబట్టు ♦ మేరయలరె. 34

తే. దట్టమై దిట్టమై శీత ♦ ముట్టిపడియె, మెట్టదానగట్టు ♦ నంగట్టి వెట్టపుట్టె
నట్టితఱి రక్కసుల కొట్టి ♦ పట్టుమిగిలి, నట్టి బిట్టుతపంబుచే ♦ పట్టియుండ. 35

క. భీమంబై వ్యథితజగత్, స్తోమంబై దిక్సతులకు ♦ సుత్రామమణీ
ధామంబై వీతక్రతు, ధూమంబై తత్తపోగ్ని ♦ ధూమంబలరెన్. 36

వ. మఱియు నీకరణి లోకాలోక దుర్లోకంబై భీకరంబులగు పోకల తపంబు ధాకసోక
సోకుమూఁకల వైరులగు పాకశాసనాదు లాకులత్వంబున నేకతంబునఁ జీకాకుపడి
శ్రీకరభూపాకర రాకానిశాకర నీకాశాకారాననంబులతో నుత్సేకంబు వడలి వీకస
డలి యీకర్బుర తపోగ్ని కాకరాకల నాకంపంబునొంది శోకవ్యాకులంబైన నాక
లోకంబునకు నపగత శోకంబొనర్ప నమాకాంతుండెగాని యన్యలోకేశులకుఁ దరం
బేయనిని కామాస్తోకమణి ప్రభాకరానేక శ్రీకంబులగు విమానానీకంబులతోఁ బినాక
గిరికిం బోవ సమకట్టి. 37

క. ముంగిటఁ గాంచిరి కలుషవి, భంగన్ మృదుపవనచలిత ♦ బహుళతరంగన్
సంగీతస్వనభృంగన్, గంగన్ సరసీరుహప్ర ♦ కలితరథాంగన్. 38

సీ. అచ్చంబుభక్తితోఁ ♦ గ్రుచ్చిన నతిజేసి, తచ్చరితము విని ♦ వచ్చి సురలు
మచ్చికల్ నచ్చిన ♦ నెచ్చెలిపింఛుతో, ముచ్చటగములచే ♦ హెచ్చిహెచ్చి
బొచ్చెంపుఁ దమకము ♦ ల్విచ్చలింపఁగఁ గడు, నిచ్చలంబగు నీటఁ ♦ జొచ్చి చొచ్చి
పెచ్చుగఁ బెరిగెడి ♦ మచ్చరంబుననందు, విచ్చలవిడికేళిఁ ♦ బుచ్చిబుచ్చి
బుచ్చి బుచ్చగుకరువలి ♦ మెచ్చిమెచ్చి, మెచ్చువచ్చిన నాళముల్ ♦ వ్రచివ్రచ్చి
యచ్చెరువు దోఁపఁ జనువిచ్చి ♦ యుచ్చదనరు, నచ్చరలకచ్చుకొనువేడ్క ♦ లచ్చుపడఁగ.

క. దరులన్ కింపురుష కృశో, దరులన్ గుసుమితములైన ♦ దరులన్ ముని ముం
దరులన్ ధృతభవభక్త్యా, దరులన్ గిరులన్ మహాస ♦ దరులన్ గనుచున్. 40

క. కరముఖర నరిగి రమితల, హరికిద్భవభక్తభవమ ♦ హరాంబుధితరికిన్
వరహరికి స్వాజితసుర, పురికిన్మదవిఖ్యాత కరికిఁ ♦ బురహరగిరికిన్. 41

వ. ఇవ్విధంబునం జని. 42

ఉ. వాడిశరమేరువాహునయి ♦ వాడనిమేనును గల్గినట్లె యు
న్నాఁడు మహాతపంబు గొని ♦ నాఁడు గజాసురుఁడన్న పేరు గ
న్నాఁడు భవత్ప్రసిద్ధి విని ♦ నాఁడు గదా యిఁక నాడునాడు న
వ్వాడితపంబుచే మునులు ♦ వాడిరి పోడిమి వీడిరేమనన్. 43

క. రమ్మా మనుఁగన నోర్వఁద, రమ్మాయిత్తపము గశుభ ♦ రమ్మా మానే
రమ్మా తొల్లిటి ఘనవై,రమ్మాయె త్తంగగిరివ ♦ రమ్మానీవన్. 44

క. బ్రహ్మా యిట్టిది కులగో ♦ బ్రహ్మా కదిలించి చూడ ♦ రామికె నీచి
బ్రహ్మా జరిపెను సుచరి, బ్రహ్మా సర్వజ్ఞనకు భ ♦ రాజార్ధాంకా. 45

క. దరమాన గాంచియేమం, దరమా తపమునను మదిబె ♦ దరమా మాకై
దరమా మకల్పగతమ్మృతి, దరమానుతుశెల్లవినఁగ ♦ దరమారనకే. 46

సీ. అక్షీణ గతిసహా ♦ స్రాక్షాను లీక్షిత, స్త్రీక్షణు నుతివచో ♦ లక్షితుఁగ స
లక్షణంబుగఁ దెల్ప ♦ దక్షయజ్ఞధ్వంసి, రాక్షస శిక్షణ ♦ దక్షవచన
దీక్షగైకొని వారి ♦ రక్షణాపేక్షియై, తత్క్షణంబున నంచె ♦ పక్షమలర
వక్షస్సు పార్శ్వస్థ ♦ మాక్షితి నీలుఁడై, పక్షిరాడ్ధ్వజుఁ డౌను ♦ ధోక్షజుఁడుని 47

తే. జాక్షయక్షపాప్తి తనమునను ♦ సాక్షిగాఁగ,
నక్షనిగ్రహమానసా ♦ ధ్యక్షుఁడై సు
తీక్ష్ణజ్ఞానకృతదురి ♦ తక్షయగజ,
రాక్షసనకాక్షణంబ పరి ♦ త్యక్షమయ్యె. 48

వ. అంత గజాసురుండు పరిణమిల్లి.

పంచచామరము.

పురారి! వారిజాసనాది ♦ పూజితాంఘ్రి కంజసత్
కురంగశూల భదరిహస్త ♦ కోవిదాళిసంస్తుతా
ధరేంద్రజామనోనుకూల ♦ దాతవైన నిన్ను నా
తరంబె సన్నుతింప నీశ ♦ దైత్యరక్షణోత్సుకా. 49

వ. అని వినుతింపఁ బరమేశ్వరుండు కరుణించి వరంబేమని ప్రశంసింప దేవా! తావక
పరిభావంబున సర్వంబు దుర్వారంబు, తాము నామనస్సీమ నివాసంబు సేయు గోరిక-
ఁయనిన. 50

తే. బోటితోఁ దెల్పకయు చందరి • జూటుఁడాని
కాటుకుక్షిని దూరియ • చోటనొక్క
యేటి పూటుననుండ న • ప్పాటి తెలక
పాటు లంబడి యగజా వ • ధూటియుండ. 51

తే. ఆస్యమునసుంద రాకృతి • లాస్యమిడగ
దాస్యగతిరేయి తద్బుధ్యు • పాస్యయగుచు
హాస్యమిగురొత్త భవవారి • జాస్యకైర
వాస్యసౌధంబుఁ జొచ్చెఁ వ • యస్యయార్తు. 52

సీ. కనుఁగొనఁగల వారిఁ • గొనగోరున విదుర్పఁ, దనమేనుసోఁకు చం • దంబెయరసి
యూర్పు పెద్దగుచిల్వ • యూర్పని పంజరం, బులభీతిఁ గొనుశుకం • బులనె చూచి
మెయికాక బెడఁగుగ్ర • మ్మినచాందినులవ్రేలు, పయిరత్నములచిట • చిటలునువిని
చవిసొమ్ము లరగప్పు • చెయిచెక్కునను జేర్పఁ, దివియుచోఁ గ్రాలుము • ద్రిక తెవెతకి
విరహవహ్ని కాంతి • వీజితచేలాంత, చలితదివ్యదీప • కళికలరసి
రాత్రిశయ్యనగజ • రాయిడిగనియిది, హరవియోగజనిత • విరహమనుచు. 53

క. ఏరామ సఖీరామల, గారాముఁ గనదు మేలు • గా! రామలలో
నోరామరో! నారామినొ, పోరామాదరి కనవిది • పోరామాటన్. 54

క. నారామిని మీరలుగ, న్నారా మును శుభముఁ జెందె • నారా సిరియు
న్నారా విన్నారా యు, న్నారా యొప్పునను జూచి • నారావేరన్. 55

తే. ఎందుఁ జనినాఁడో నీకాంతు • డెందునేఁడు
మందయానరొ దెల్పుమా • చందమనిన
నిందు ధర సుందరీ మణి • యిందుముఖికి
నందముగఁ బల్కెనెయ్యంగనే • మందు ననుచు. 56

క. కేళిజి తదిక్పతి పుర, పాళీవిభ వాత్మపురని • వసద సురసుహ్రు
న్నాళీకాళిగ శంకరు, నాళీతల్లజ మెఱింగి • యాకాళి కనెన్. 57

ఉ. అమ్మరో నీదుభర్త విన • యమ్ము నయమ్ము దలిర్ప దేవ వ
ర్గమ్మునకై యనుగ్రహ ము • ఖమ్మున వాక్యము నమ్మ నెమ్మి దా
నమ్మిడి తత్ప మ్మతి ఘ • నమ్ము నిజమ్మున దైత్యకుక్షి నం
దమ్ము దృఢమ్ము గాఁగ సత • తమ్ము గృహంబుగ నుండె వింటివే. 58

ఉ. ఎక్కడి దంతిదేవరిపుఁ • డేటితపం బదియేటికుక్షి దా
నిక్కము దెల్పఁగాఁ దితృవ • నీచరుఁ డారఁడు వానికేగతిం
దక్కెనొ యీలతాంతములు • దక్కెనొ యీసుమ మంజరీ లతల్
దక్కెనొ యీనికుంజములు • దక్కెనొ యీనెలరాల మాడువుల్. 59

సీ. తివిరి నీపతి పూల • తీరు పూగుత్తుల, జారు క్రొన్ననలని • గారు మొగ్గ
గుంపులసౌరు పు • ష్పంపు మాకులకోరు, చాయయొయారు వా • సనలయేరు
విలాలతలకారు • మేలికప్రపనంట్ల, ఝంకోరు కేతకుల బి • డారు కురువ
కప్రసూనాఢ్య శా • ఖా మరుత్తుల హోరు, పొదరిండ్ల చూరు పూ • బొదలయూరు
పోక పొన్నల ముక్కారు • పూవుతేరు, మల్లెమొగ్గల చేరు చా • మంతి బీరు
విభవములుగల్గు నివ్వని • విడిచి చనియె, భస్మలిప్తాంగు నెట్లొంచు • భాగ్యరములు.

ఉ. చందన వాతపోతములు • చల్లఁగ వీచుచువచ్చెఁ దావినిం
దిందరలక్ష్మి యుబ్బుకొని • తీవెల నుయ్యెల లూఁగఁజొచ్చె మా
కంద లవంగ కుందములు • క్రన్ననఁ గ్రొన్నన లిచ్చె కిన్నరీ
సుందరగాన మీరెడలఁ • జూడఁగ హెచ్చె ధరాధి పాత్మజా. 61

చ. వనమున నొక్క కొమ్మ గగ • నమ్మును నొక్క లతాళి కొమ్మసం
దునఁ గడుఁజిక్కెఁ గెంపుప్రభ • తో సుమమంజరి సొక్కె దానిచెం
తను మధుపాళి తక్కె వసు • ధాజములం బికమెక్కెఁ బూలవా
సన లటుపొక్కె దర్పకుఁడు • చాపము నెక్కిడి నక్కి నిక్కెడన్. 62

ఉ. పొయలునఁ దేరుమావి గగ • నోన్నతిఁ జేరెడితావి కోరకో
దయమున మీరుకావి విత • తప్రభ గేరెడితీవి చిత్రితం
బయి దగుపూలదీవి కట • కాంచితమా దిగుబావి గల్గు నీ
ట్పుయుపరి సేవి యీవనికి • సామ్యము లేవి వనీవిశేషముల్. 63

చ. చెలువపుఁదూడుతేటు సర • సీజసుమంబుల నీటు కోరసం
బుల బలుడీటు సౌరభపుఁ • బుప్పొడి తిప్పల నేటు తమ్మికే

కుల దగు పూటు చూపరకుఁ ◆ గోరిక చ్చెడిచోటు ఈకాలం
కుల దగుపూటు దర్పకుని ◆ గోటుకు ప్రేటుకుఁ జోటు బోటిరో. 64

క. మానుగఁ గూజత్పికసం ◆ తానము వల్ల న్వగేవి తానము వితతో
ద్యానము గాయు ద్భ్రమరీ ◆ గానము వనమిట్టి దెందుఁ ◆ గానము చెలియా. 65

ఉ. కాంతుని మంతనంబు గల ◆ కాంతనటంచు వచింతుఁ దొల్లియో
యింతిరో యంతలంతలుగ ◆ నెంతయుఁ బోదిది వింత నాకు సా
మంత లతాంత కుంతునిసు ◆ మంత శరాహతి నింతయయ్యె నీ
వంత యనంత మిట్టివల ◆ వంత నెలంత లోకించ రొందురే. 66

ఉ. చందనగంధి నీమగని ◆ చందము గందును ముందుముందు నీ
యందునఁ గూర్మిఁ జెందు నను ◆ టందుకు సందియమయ్యె నిందయా
నందున కుంద డిందుపడ ◆ నందము నొంద నుతింద నర్చు నీ
సుందరుఁ జెందఁ గోరి సిరి ◆ సుందరుఁ డెందమ మందతం దగన్. 67

ఉ. బాలరో వీలుగా వెతల ◆ పాలుగఁ జేసెఁ గపాలమాలి ని
ర్భేలవుగాన లోలుఁడన ◆ ప్రేలెదు కాలునిబోలు నాతఁడి
కాక్రోలము పూలవిల్తుఁడిడు ◆ గాలము పోలిక జారె నింక గో
పాలుని ప్రోల ప్రొముక్కి మెయి ◆ పాలను దూలను సోల నేటికిన్. 68

ఉ. అండజయాన యానలిన ◆ జాండములు న్దనరిండు కుక్షిలో
నుండుఘనుండు కుండలిశ ◆ యుండు నినుండు గనుండ దీనిచే
న్గొండగఁ జూడ కొండుగ ఘు ◆ నుండగు నీవు విభుండు చేరు నీ
దండకు నూనకాండ రణ ◆ తాండవ పండిత వృత్తి నుండగాన్. 69

క. మనగాలి పలుక్రిచే నే,మనఁగా దా రకర్సుండు ◆ మనగా హరుని
మ్మనగా నాతఁడు వాసా, మ్మనఁగా వెడలింపు వేగ ◆ మనఁగా దగజా. 70

క. కామో సముదుత్తినివిన, రామో ఘముదారపీడ ◆ రావీదరికై
యేమో సముడుండగ మన, కేమోసము రానదేమి ◆ యొతిఁగింపు చెలీ. 71

క. లలనా దెల్పఁగ గలనా, కలనా కలనాడు బొడమె ◆ కలనారులు నా
కలనారుల నానిల నా, కలనాడెంచాన దైన్ని ◆ కల నాకెంచుకా. 72

సీ. సమ్మోము నమ్మకు ♦ సెమ్మి నీసెమ్మని, వమ్ము నిజమ్ముని, జమ్ము దమ్ము
గమ్మకు చెపుదు చి ♦ త్రమ్ముగాఁ గలవిన, యమ్ము నయమ్మునఁ ♦ గ్రమ్మనీడు
సొమ్మ్రగ విను బలు ♦ గొమ్మపొకమ్ము రూ, పమ్మున నీలభూ ♦ తమ్మ్రకందు
అమ్మరో మేటిద ♦ య్యమ్మున ద్రింగ ఘో, రమ్ముగ తన్త్రీవ ♦ రమ్ము తమ్ము 73

తే. గ్రమ్మెడు గరిమ్ము వైవర ♦ త్నమ్ము వలన
నిమ్ముగఁ బడసెఁ బతిని సౌ ♦ ఖ్యమ్ము గనఁగ
నమ్మెయిని నమ్మహితవాతృ ♦ నమ్మకుంటి
తప్రిమ్ము గాదిది బొమ్ము స ♦ త్యమ్ము సుమ్ము. 74

తే. దండిగల భూతమరయ వే ♦ దండదాన
వుండు గిరిశుండు మొదటిదే! ♦ వుండు వాని
నిండుగా! నీకుఁ గూర్తి రెండు ♦ డొండు చేయు
చుండు మహి తుండు వారిజా ♦ కుండు డతండు. 75

సీ. మృదు పదములుగాఁగఁ ♦ జదివెడి నావాక్య, పదవిని వదరుగాఁ ♦ గదురనీక
మదవతి రోయిది ♦ యెదలోనఁ దిరముగ, వదలక మెదలుచుఁ ♦ బొదలి పొదలి
యదియిది యనరాక ♦ కుదురని బలుచింత, బ్రిదిలి బ్రిదిలి పోవ ♦ జదివిజదివి
చెదరక కదలక ♦ యెదయాత నవవిల్తుఁ, డదనైన ములుకులఁ ♦ గుదుల గుదుల

ఆ. పదిలమై మొదవగ దిమి ♦ యదిమి యదిమి నాట
చెదరిచెదరి చెదరి ♦ యదరనేల
విదిత మదనజనక ♦ పదమది మదినమ్మ
కొదవలున్నె వెతల ♦ జిదుము కన్నె. 76

క. క్రిందట నిందుధరుఁడు నీ ♦ యందునఁ జెందెడి సమాఖ్య, లందుదురెపరుల్
కుందరదన నందనవన ♦ సుందర హరిచందన తరు, సుమకోరికలన్. 77

సీ. చెలువుని వలనను ♦ గలిగిన వెలుతులు, వెలయఁగఁ దెలుపరు కలుకు లిలను
జిలుకల కొలికిరో ♦ పలుపలుకుల నన్న, వలదు వలదు కల ♦ విలసె దొలఁగుఁ
జెలువలదొర తోడ ♦ వలపు బలము బలు, విలవిలఁ జెల్లఁగుదు ♦ మొలఁగు టేటులు
కలిగిన యలజడి ♦ వెలుపల నిలుపక, కులుకులు దలముగఁ ♦ గలయ నోలపె. 78

ఆ. పొలయలుకల చెలువుగల ♦ యలయలుకలు
పొలపు మెలపె లరగఁ ♦ దొలగనలపె

కలుషములకోలికి రొదను ♦ మెలఁగెడి బలియుని
కలిత దయలు గలుగ ♦ నలుక నగునె ? 79

సీ. తనియని మనమున ♦ వనజనయన నన్నుఁ, గనుఁగొని యానవినఁ ♦ గనుము వినుము
వినఁగను గనకను ♦ విననిది కననిది, మునుమును జను జన ♦ మునఁ జననిది
పెనఁగినఁ గొననిది ♦ చనువున మననిది, మినుసిగగలఘను ♦ నెనరుమనుఁగ
ననువుఁగఁ గనికని ♦ యును మునిఁగిన మతి, వినయమునను నుతి ♦ గొనఁగఁ జనునె
చెనఁటి తనము మనఁగ ♦ నెనగన మనికిరై
చనిరొఁ జనిరొఁ దెలివి ♦ యును బెనగొన
వనజనయన మృదుకృ ♦ ప ననయమును మన
గను జనునకు గనిగఁ ♦ గనదె జయము. 80

వ. మఱియు గట్టుపట్టి! నీవిప్పట్టునఁ జెట్టఁబట్టినట్టి దిట్టరయెడ గట్టిబెట్టున బుట్టు చిట్టిచి
ట్టి కట్టలకలచే బిట్టైనకట్టడికట్టు నట్టుపఱచి చుట్టపుతిట్టల కట్టహాసంబు లుట్టిపడ గు
ట్టుచెడ రట్టునిడ నిట్టిట్టని ముట్టడిపెట్టిన ట్టొకపెట్టున వదరుపట్టకు మీ గుట్టలవలె ను
న్న వట్టివట్టి తెట్టిమాటలఁ జెవిబెట్టకుమీ చిట్టని చట్టున మిట్టిపడని పాలబొట్టువలె
యశోఘట్టనుండగు చట్టువలగొట్టు జెట్టి తోబుట్టు పాట్టిబొట్టెడగు పిట్టతట్టురాతు క
ట్టములిడ పట్టైపుట్టిన పెట్టుచెట్టుగదా కట్టువలుగల పుట్టలవలె కట్టకట్టలగు పాపంబు
మెట్టల నొకఁడ పెట్టు కొట్టుఁగదా అట్టివాని దయముట్టుకొనిన నెట్టకేల కనక కట్టె
దుర గట్టువిల్తుండు దైత్యుపాట్టవెడలి నినుముట్టి వట్టంబులేని చుట్టరికంబునఁ బట్టణా
సౌధంబున మెట్టాయితాదుల నట్టహాసంబులఁ జుట్టుకొని తట్టుపున్గు నలఁది కుట్టిమంబు
లఘట్టించు దట్టంబులగు వజ్రపుపట్టెలుగల పట్టెమంచంబుల వట్టివేళ్ల సురటులులియ
పట్టుపుట్టంబు గట్టు చుట్టువాలుదాల్పు కట్టకడఁ బుట్టుపులీలల నెట్టలేక తేలెదు ప
ట్టపగలి బట్టబయలి తెరువరి కుట్టున బ్రేలెదు కొట్టగాని బిట్టనవ్వులను తేనెపట్టులఁ
గ్రోలెదు ఇట్టిపనికి నెట్టొయనివెట్టనూర్పు నిగుడించిగికురుపెట్ట వలదని మఱియును.

క. సందా వినగంటా గన, నందా నీమతికి నవ్వ ♦ నందో ధరఘన్
కుండా పొండా కోయిది, కందా నిందానె నీల ♦ కంఠాఘకళా. 82

తే. ఏర్పడిన దోర్పు మార్పడ ♦ నేర్పరించి, నేర్పునేర్పున జెందగఁ ♦ గూర్పుచేసి
తీర్పు తార్పును బోకార్పు ♦ దోర్పకమది, నోర్పు కనుమార్పు నిట్టూర్పు ♦ లార్పవలదు.

క. పగదగ దెగదిగ మదిదా, పఁగఁ దగ దొరలకిది నేరు ♦ పగఁ దగ దిలచూ
పగ దగ దోపఁగఁ దగ దా, పగ దగ దెవ్వరికి మాను ♦ పగదగ దబలా. 84

క. నగదగు ధరకనువారి క, నగఁదగు విను వారికి ది ♦ వినగదగు మదినా
నగఁదగు హాస్యముగా నె, న్నగఁదగు గడుమనఁగఁదగు బె ♦ నగఁ దగ దిందున్. 85

తే. కాళితో నిట్లుపల్కి యు ♦ య్యాలి చనినఁ, గేళిగతి దక్కి మిగుల వి ♦ రాళిఁ జెంది
యున్న యయ్యుమఁగని దరి ♦ నున్న చెలులు, పలుక నేమియు దోచక ♦ పలికిరిట్లు.

సీ. పూర్ణ చంద్రోదయం♦బున హెచ్చుడఁగునన్నఁ బూర్ణచంద్రోదయం♦బున నెహెచ్చుఁ
గుసుమాకరమునఁ ద ♦ క్కినవియౌనొకో యన్న గుసుమాకరంబునఁ ♦ గోరి హెచ్చు
బంచబాణరసంబు ♦ నించఁబోవునటన్న, బంచబాణరసంబు ♦ నించ హెచ్చు
మొనయు చుమద నాస్త్ర♦మునను బోవునటన్న, మొనయు చుమద నాస్త్ర♦మునను హెచ్చు
నిండుముఖి కుందు సుందరు ♦ లందు నెందు, జెంద నీకందువలు బోలు ♦ పొందముందు
నిందుధరకుందరదనకు ♦ నిందవయ్యె, బొందుగల మందు లింకేరి ♦ నందుమమ్మ. 87

సీ. ఉదయమార్తాండ చం ♦ ద్రోదయంబు లిడ్రపై, త్యంబు గాదిది విర ♦ హంబు గాని
రావణాస్త్రరసంబు ♦ రామబాణము గూర్పు, జ్వరముగాదిది స్మర ♦ జ్వరము గాని
కాలకంఠరసంబు ♦ కామేశ్వరము గూర్పు, వ్యాధి గాదిది తగ ♦ వాధి గాని
కాలసర్పరసంబు ♦ గరుడరసము గూర్పు, సంధిగాదు మనో వి ♦ సంధి గాని
మెండుగల యౌషధపుగవ ♦ నొండుచేసి, గండుకొని యివ్వఁగా బడ ♦ కుండ నేమి
దండిగా దీని మాన్పఁ ఘ ♦ నుండె చూడ, గుండలికయుండెగాని వే ♦ రొండులేదు.

ఉ. తెమ్మెరపిండు గాంచి సుద ♦ తీమణి వేదన మాన్పుమంచుఁ జి
త్తమ్మున నంటిమా మిగులఁ ♦ దత్పతిభూషణభోగి సంతతుల్
మమ్మశనంబు సేయునిది ♦ మాన్పుదుమే యనుమారు నన్న ని
క్కొమ్మ మగం డనంగునిగఁ ♦ గూల్చెనిదేటికి మాన్పు సేననున్. 89

సీ. తొగగాంచి చెలివెత ♦ దొలగించు మంటిమా, లలనాక్షి వైరబ ♦ లంబె చూపుఁ
దమ్ములజెలివవే ♦ దన మాన్పుమంటిమా, తరుణీవదన విరో ♦ ధంబె దెలుపుఁ
బూలగుత్తులఁగాంచి ♦ బోటివేదన మాన్పు, మనఁ దకుక్కి చవిరోధ♦ మునను గెరలుఁ
జివురుతోఁ జెలివెత ♦ చెప్పగా నచ్చెలి, మావితో నీర్ష్యగా ♦ ముచ్చటించు
గండు తుమ్మెదగములఁ కు ♦ కముల హంస, రాజములఁ గప్పురపుటంట్ల♦రమణి కుందు
వణఁకుమన నాశిమాచల ♦ జాలకో క్తి, గతిమహోర్వీష్యలను దెల్పి ♦ కలఁక నొందు

ఉ. వనరుహనేత్ర కిప్వేతలు ♦ వారివిహారము చేతగాని కాం
తిని గనవంచు నొక్క జల ♦ తీరముఁ జేర్చి జలంబులో సఖుల్
కనకలతాంగి ముంప సఖి ♦ కాయ మహా విరహాగ్ని చేత నం
త నుడుకునొందె నజ్జలము ♦ తండ్రిగుణంబును బూనెనోయనన్ 91

సీ. పోరి కోకములు కా ♦ సారంబువెడలెఁ గా, సారజంబు లడంగె ♦ నీరమునను
మీఱె శైవాలంబు ♦ క్షీరంబు జేరె న, వారితంబుగ వారి ♦ దూఱె మీలు
దోరి కూర్మము లధో ♦ ధారుణిఁ జొరబాఱెఁ, జేరువ నక్రముల్ ♦ గోరిదాఱె
వారలకై బిస ♦ వారంబు దాఁజేరె, ఘోరాహులడరి చె ♦ న్నారె నవియు
నారి కుచ ముఖ కచ నయ ♦ నోరు పాద, చారు మకరీ భుజజటాగ్ర ♦ కారసామ్య
మోరువఁగలేక కాఁబోలుఁ బాఱె నిట్లు, సారసానన జలకేళి ♦ వేరుగాదె.

తే. అతనుఁడు ప్రభంజనుండు దో ♦ షాకరుండు, ధరజ కార్యంబు సేయమి ♦ ధర్మమాను
శీత గంధాదికంబులు ♦ చెలియ మేన, శీతలము సేయకుండుట ♦ చిత్రమరిది.

వ. అని యని.

క. ఘన వాగ్వైభవతరివర, మున శ్రీశకథాబ్ధి మునుఁగు ♦ మునులను నూతుం
డను నాపతి పశ్చాత్కథ, !యను జలనిధిఁ బ్రాక్కథాని ♦ లాహతి ముంచెన్.

క. శ్రీమ త్తొక్కమరపురీవర, ధామా దానవవిరామ ♦ ధరభిద్రత్న
శ్యామా వేదశిరోనుత, గోమా రిపు భీమ వేణు ♦ గోపాలహరీ.

పంచచామరం.

పతంగ చంద్ర నేత్ర సర్వ ♦ పావనా సురావనా
మతంగ జార్తి కారి నక్ర ♦ మర్దనా జనార్దనా
సతాహితస్తుతిప్రకార ♦ శారదా మణీరదా
యతీశ వంద్యమాన సత్ప ♦ దంబుజా ద్విజధ్వజా. 96

మ. జగదుత్పత్తి నిదాన దాన గజర ♦ క్షాదక్ష దక్షఘ్న మ
స్తగపాదాంబుజతీర్థ తీర్థవృతన ♦ ష్టప్రాణ పుత్రప్రదా
నగరిస్థాత్మ విశేషశేషముఖ ♦ నానానిత్య ముక్తోపభో
గ్య గుణస్తోమ నివాస వాసవ మణి ♦ శ్యామాంగ మాంగాంచితా. 97

గద్యపద్యము.

మ. ప్రథిత ప్రాభవ కాశ్యపాన్వయ సుధా • పాథోధి రాకాకళా
నిధి నారాయణ సూరిరాడ్రచిత ని • ర్నిద్రాబ్జ పాళీగళ
న్మధుధారోక్తి గణోదయాభినమహా • మంజు ప్రబంధంబునన్
ప్రథమాశ్వాస మిదీక్షు మాతలమునం • బ్రఖ్యాతమై యొప్పెడిన్. 98

శ్రీ శ్రీ శ్రీ





శ్రీమద్గురుభ్యోనమః.

# గ ణో ద య ము.

## ద్వితీయాశ్వాసము.

క. శమిత మహాసురజాలా ♦ రమణీయ గుణాలవాల ♦ రాజిత లీలా
శమితజన విలయకాలా ♦ కొమర పురీపాల వేణు ♦ గోపాల హరీ. 1

వ. అవధరింపుము. 2

తే. సూనశర సూనశరబాధ ♦ మానవతులు
గ్లాని పూనంగ నాటలా ♦ కానలలమి
మానుపుమరది పోదాయె ♦ మానవతిని
బూని గొనిపోద మింకను ♦ ద్యానవనికి. 3

క. ఈవేళఁదికి వనమునఁగల ♦ తీవెల పొదరిండ్లఁ బూల ♦ తిన్నెల నవలా
ప్రోవుల మావుల పుప్పొడి ♦ తావులనుం జూప వెతలు ♦ దరుగవె తెలియన్.

వ. అని. 5

క. బలువెతలఁ దలఁకునగజను ♦ జెలులత్తఱిఁ దోటలోన ♦ జేరిచి యప్పూ
వ్వులు చూపించిన వెతల ♦ గ్గలమయ్యెం బూలు కామ ♦ కాండములౌటన్. 6

క. అగజకు విరహం బాప్పఁగ ♦ నిగురులు మొగ్గలును దోడి ♦ యింతులు గోయన్
బెగడొందె దర్పకునకవి ♦ యగుఁ గత్తులునుం గటారు ♦ లనిబలు వెతలన్. 7

రగడ. ఇంతి కురవకమ్ము గాంచి ♦ యెంత యడలె విరుల మించి
కాంత మదిని వెతలొనర్చు ♦ కాలమాటబగఁ దనర్చు
చామ యాశిరీషములను ♦ సరస బోవదు కలనిలను
కేమ తనువే వుండ్రమొందు ♦ లీలఁజెంది భీతినొందు
పూలరజము కొప్పుపైని ♦ ఘూరిగతులరాలఁబూని
బాల మరుతుపాకిమందు ♦ భ్రాంతినొంది మిగులఁ గుంచు

తీగెగములు సొగసుబారు • దెరలి తెరలిమాచు మారు
తూఁగుటుయ్యాల లనిమిగులఁ • దోయజాక్షి వగపు దగుల
మేడనున్న చెలిని వేగ • మించితోట లోకిఁ దేగ
గూడె నిచట నధికమగుచుఁ • గువలయాక్షి ఖేతలుదగుచు
నెంచి యవిటికంట మందు • లిడిన దానివలన ముందు
మంచికన్ను పోయినట్లు • మగువ వెతలు హెచ్చెనిట్లు. 8

సీ. పల్లవాధర స్మర • బాణంబులని విరు, ల్గోయబోఁ టికములు • గూయజడిసెఁ
గోకిలఁ దోలంగఁ • గుండలి వేణియుం, బర్హినాదము రాఁగ • బడలుపడియె
బర్హిని భీతిచేఁ • బట్టంగ బిసబాహ, హంసలఁ గనుఁగొని • యడలు కొనియె
హంసలఁ జోపఁబో • నడరి బింబాధర, శుకములఁ గనిభీతి • సొక్కియుండెఁ
బాటలాధర వేదన • పూటు చెంద, మాటుపడఁజేయఁ జూచిన • బోటులమొద
మాటిమాటి కీవేదన • పాటికెక్కె, మేటి సెగను సమ్మెటపెట్ల • సాటిగాద. 9

వ. అంత. 10

క. నగకన్నియ కివేదన • తగనిది పాడమాపెఁ జూడఁ • దగదని వేచే
వగమిగులఁగఁ దానరిగెఁ జ • నఁగఁ దొగలవిరోధి యపర • నగ[illegible]నకరిగెన్. 11

క. దీపంబు లిండ్లఁగాంచెను • వ్యాపించెను దార లరుణ • మాకా[illegible] ధరన్
దీపించెఁ దిమిరతతులు వి • లాపించెను జక్రములు క • లవర[illegible] నించెన్. 12

తే. రాత్రి రాజ్యంబు నేలఁగ • రతివిభునకుఁ, జేయు చున్నట్టి పట్టాభి • షేకవేళ
వేల్పు లెత్తిన ముత్యాల • వెల్లగొడుగు, నోజఁ దగెఁ జంద్రమండలం • బుదయగిరిని.

సీ. కొమ్మలకై మేలి • సొమ్ములకై పోవు, జారచోరులకిది • మాఱుతల్లి
తముఁబాసి పతులన్య • తరుణులఁ జెందినఁ, గనలొందు సతులకుఁ • గన్నమాత
జారిణీ జారులఁ • గూరుప మదిఁగోరి, మెలఁగు దూతికలకు • మృత్యురాత్రి
యొక్కొల నెకుకొడు • రొక్కము గలిగిన, పెనుధని కాళికిఁ • బెండ్లివేళ
పణ్య రమణీజనని మనో • భయ విధాయి, పనులఁ జరియించు వారికి • భాగ్యలక్ష్మి
హీన దీపాలయులకు ల • క్ష్మీనిధాన, మగుచు జాబిల్లి వెలుఁగప్పు • డతిశయిల్లె. 14

వ. ఇవ్విధంబున నచండకర కరపిచండిల కొమదీమండలంబు లొండొండ సముద్దండ తండంబులై కాంతికరండంబులై చెంగుపడి గంగుమిగిలి నిండుకొని ఖండల్యాఖండల

ఘోషకుండైన చండీశుండున్ను వెండికొండ పిండువలె నఖండంబులై మెండుకొని యండజవాహనుండైన పుండరీకాక్షుండున్ను పయోనిధి వీచికాండంబులనఁ గుండలుల భాతి వేదండంబులకరణిఁ గోదండంబులవలెఁ దుండంబులవడువున గండభేరండంబుల పగిది గండశిలలకై వడిఁ దరులనీడల దండగల కాంతిషండంబులతో దైత్య గర్భస్థుఁ డౌట భర్గు శిరంబున నిముడక యొంటుమై యునికి తెంపుకొని డిండీకారంబులతోఁ గైలాస నగము దండకై గంటుకై దువదాల్పు పాపయును మెండుగా నాపైనుండు దైవాఖండలుండగు నాగాభరణుం డొండొకచోట జెందుపడెనో యని యతనికై కైలాసంబు నన్యోన్యంబు దిరుగుదిరుగు చందంబున బ్రహ్మాండ భాండంబు నలమి నిగ నిగమను నగుమొగంబుల జిగిబిగిమిగుల సొగసుగులుకు ముగుదగములు మగలకై తగిన యెడలకరుగు తఱి ధగధగమను వెన్నెల గములతో నగులు బోగులునఁ జను మగువ ల దూతికలని గణింపఁ దగరని మిగులవగలఁ బొగిలి యసువులు దెగడి వియోగంబు దగల నిగిరియిగిరి మరల నిగమంబులకుఁ జను యూనజార మానినులును వాటంబైన వెన్నెలల చాటలతో కాటనధ్వజాని వేళల మాటుపడి లోటుచెందిన నిండ్రియపాట వంబున బోటులతో కూటంబులు నేటుకొనమింజేసి కైటభారిం దూరు వృద్ధజార పు రుషకోటులును మదనువెతలఁబడి యదనైన వృద్ధత్వంబని యెఱుంగక కచంబుల పలి తంపు బుష్టికి కుచంబుల నష్టికి జారతాపప్రసంగంబు నిర్దిష్టికి కించిదృశ్యమాన దృష్టికి తనువికంపన సృష్టికి విటసంయోగాభావ స్పష్టికి నిశాపతి ఘృష్టికి వగచు వృద్ధజా రిణులును శశధరత్వంబులు ద్విజరాజత్వంబునుం గలుగు నిన్నుఁగనువారి కార్శ్యంబెరి తి నానని తారాపతి నిందించు దూతికా పారసాక్షులునుం గలిగి విటవిటీ మనోభి మంబై విశాపథామంబై యున్న సమయంబున. 15

క. నగరాజ తనయ దివిభువి, నగణిత ధవళప్రభామ • యంబగు జ్యోత్స్న
న్మిగులఁ బ్రకాశమునఁ దనరు, మృగధామునిఁ గాంచి బలుత • మిన్వెతనొందెన్.

క. అంతం జండాంశుప భా, త్యంత క్లాంతాద్రి సంధ • వాసన రుచిదా
కాంతేఁ గనుఁగొని యందొక, యింతినుతులఁ గుముదవిభుని • నిట్లని పలికెన్. 17

తే. వసువులు కళలు గల్గు న • వారితముగ, రాజవే కావు రాజాధి • రాజవీవు
హరికి బావవు క్షీరాబ్ధి • కాత్మజుడవు, సిరికిఁ దోబుట్టు వహహా! వి • శేషమిది.

సీ. కువలయంబు ప్రకాశి • గొనునె నిన్ననకున్న, నీవల్లు లేకున్న • నిఖిలమునకుఁ
జీకటి పోవునే • చెలఁగి నీకరముల, నీకున్నను జకోర • మెటు బ్రతుకురా!

నిన్నుఁ గాంచక యున్న ♦ నీరధి పొంగునే, నీ ప్రకాశించునే ♦ నీవులేక
య్యాహ్లాద కరుఁడని ♦ యనరె నిల్లోకంబు, లతనునకు సహాయ ♦ మౌదుగాదె
నలువ జనముల కిడిన యా ♦ న్నంబు వలన, మరణమును జేసె వారిక ♦ మర్త్యకోటి
నీసుధను దిని జరమృతిఁ ♦ బాపి రనఁగ, దాని వెతహెచ్చ శశివని ♦ రీసుమిగిలి. 19

తే. కింకచేఁ బంకజాక్షుల ♦ పొంకమణఁచి, కొంకకను బింకమొప్ప వి ♦ శంకటగతి
నంకిలిగ వంకరలుసేయు ♦ టొంకువగుదు, శంక నీకింక లేదు శ ♦ శాంక చూడ. 20

క. భూతేశ శిరోమణి చ ♦ క్రాతి భయాపాది విషధ ♦ రాధ్వగమన వి
ఖ్యాతి కుముదాప్త నీవిప, రీతప్రభఁ జూచిమెత్తు ♦ రే పద్మాక్షుల్. 21

క. క్రమముగ నమృతాఖ్య ఫణివి, షమునకు దుత్తారమునకు ♦ స్వర్ణద్రుమనా
మము మాలక నిమిషాఖ్యయుఁ, గ్రమసతులకొనర్చు నీకుఁ ♦ జంద్రాఖ్యతగన్. 22

క. వేరొక సతి శశిఁబలికెను, సారస జాన్నమునఁ బ్రజలు ♦ సప్రజాలు భవ
త్సార సుధాన్నము గొను సుర, లారూఢిగ నప్రజాలు మ ♦ హాత్ముఁడవెకదా. 23

ఆ. మరుఁడు హరికొమరుఁడు ♦ మంజుల కుసుమ తో
మరుఁడు విటసమరుఁడు ♦ మార్విక్రుద్ధ్బ
మరుఁడు సోమరుసు వి ♦ మానత సన్నుతా
మరుఁడు గల్గ వేర ♦ మాటలేల. 24

సీ. భువి పుణ్యకాలమై ♦ పొలుపొందె మకరంబు, నీధ్వజ విఖ్యాతి ♦ నేర్పదేమొ
భర్గుని తలకెక్కెఁ ♦ బద్మారి నీదగు, మాతుల సామర్థ్య ♦ మహిమ యేమొ
కవికి నుచ్చగృహంబు ♦ గానయ్యె మీనంబు, నీకేతనఖ్యాతి ♦ సోకనేమొ
రామ స్మరణచేత ♦ రంజిల్లె శుకములు, నీరథం బైనట్టి ♦ మేరయేమొ
యట్టి మకరేందు మీన శు ♦ కాళి మగువ, నక్ర భూషానన సుశేత్ర ♦ నవ్యవాక్య
భూరిమితి తగ నెఁ జెలిఁ ♦ బోవవేర, వీరనగధీర లక్ష్మీశ ♦ మార మార. 25

తే. పూలపాగా తలనుదేరఁ ♦ బూలదండ,
మెడను బొలుపారఁ గవచంబుఁ ♦ దొడిఁగి మీర
వెడలు నినుఁజేర నీబోటి ♦ కలఁగె నార
మనుప విదియేర లక్ష్మీశ ♦ మారమార, 26

క. ఇప్పగిది సన్నుతించిన, నప్పటివలె నగజవిరహ • మేర్పడ యున్నన్
దప్పరమై ప్రీతిఘామతి, యుప్పతిలఁగ మరలనొక్క • యువతివచించెన్. 27

తే. ప్రీతిచేఁ బుండరీకాక్షు నూతివనుచు, మాతలోదరి నుతిఁజేసెఁ • జేతమెడలి
యాతనికి నీకుసరివాని • భూతలమున, ఖ్యాతి గజమశ కాంతర • రీతిగాదె. 28

తే. తాత యన్యజాతిస్త్రీల • దారఁ జేసె,
నత్తనాలుగా వరియించె • నరయుదండ్రి
మతిదొలంగి తిరుగఁజొచ్చె • మాతధాత్రి
నెన్నఁ జిక్కెను నీవంశ • మున్నయెడల. 29

వ. మఱియుఁ గొమ్మమొకమ్ము నడకగల యిత్తమ్మికంటిపై నీతమ్ములమ్ములు వమ్మాగదా యిప్పికవాణిపై నీచివురుకటారులు వెలవెలబోవుగదా సారసార వాగ్వేణీ శాతోదరంబులయెడ నీకీర మలయానిల రథంబులు దారిఁజెడి తిరుగుడుపడుఁగదా యీచేడియ వేడియూర్పుగాలుల నీపూలవిల్లు తూఁగుఁగదా యిక్కాంత మొగమింత జేసిన యెడ నీమాతులుండైన చందురుండు నిస్తేజుండౌనుగదా యీసుందరాంగి సందర్శనంబున నీకనంగత్వంబు సార్థకంబౌనుగదా నీనిందాసముద్రంబునకుఁ బారంబు గలదేయని మఱియును. 30

ఆ. అంగనాధిమాన్య • మంగళమ్ము లొసంగ, రంగుమీరు చిన్ని • నింగిచూలి
పొంగుచుండఁ గమన • మంగజుఁ గొనియాడ, వెంగళులముగాక • సేంగితులకు,

వ. అని తెమ్మెరల నుద్దేశించి. 32

క. పాలతులు మగలును సౌధ, స్థలముల నన్యోన్యరతుల • సమయంబుల నం
దుల కేఁగఁ దచ్ఛ్రీమోదక, ముల నార్పఁగ నీకెతగు స • ములునీకౌయకే. 33

శా. సారంగంబు భవద్భయంబనుచు నా స్త్రం • బాణియందుంచి య
త్తారావల్లభ శేఖరుండు ముదమొం • దన్ బాచె నీన్యంబు ద్వ
క్స్వరప్రేక్షణ మొందె నిమ్మగువ రై • క్యంబిక విరిద్దరిన్
ఘోరానంగజ బాధగూర్చినను ద • గ్గుల్మీకు రాకుండు నే. 34

సీ. మరలకు విహరింపఁ • దెరవయ్యె నీతండ్రి, ప్రాణిరక్షణమునఁ • బరఁగితీవు
రాముకార్య ధురంధ • రతఁబూనె నొకపట్టి • ఘోరవైరులఁ గూల్చెఁ గొడుకుపట్టి
యుచితచే నిలపరి • యుద్ధంధు తొలిపట్టి, యవని భూతముచేసె • నతనిపట్టి

యిలను బోరిరేఁగఁ బరఁట • నిచ్చి వాసతిపట్టి, యొగిఁ గౌరవులనోర్చి • నొక్కపట్టి
గాన మామానినికి జెత • సూనుప్రమన, వానెలఁత వెతలగ్గమై • మానకున్న
మానవతి యోర్చు కప్పవ • మాను నరసి, పూనె దూషణోక్తుల కస • మానగతుల.

క. దానవి కోడలు తనుమఁడు, దానవుఁడో జారదార • తనయుఁడు కపియో
సూనులు కూఁతులు రోఁగియుఁ, గానని కనువాఁడ నీకు • గర్వంబేలా. 36

తే. ఒడలు నుమవు నిల్కడ కనఁ • బనుటలేని, జమని నిమగడుసులవిడి • స్తవమునింద
పడతి పడిఁజేసి మంచిదా • విడిది వెడలి, యడవి నడుమను నడలిన • కడిదిగాదె.

ఆ. లేడి వాహనంబు • పేడివాఁడొకపట్టి, వేడి వాఁడు సచివుఁ • డాడిపాడు
చేడె మనుమరాలు • బోడి నీ వాడిని, నాడి యొగ్గులాడి • వెడనేల. 38

కవిరాజవిరాజితము.

అని కళి పుష్పక • రా నిల పోత మ • హానుతి నిందలఁ జేయఁగన
క్కనకలతాంగి క • ఖండపువేదన • గాగ భయంబడి యొయ్యనఁ జ
య్యన విరికయ్యె నొ • యారిని జేర్చి న • యంబున వేదనలారఁగ వీ
వనలను వీచిరి వారిజనేత్ర ల • వారిత హృద్గత యాతనపోన్. 39

సీ. కెందొగరేకులఁ • గందోయి డాయించి, చెక్కులఁ గప్రపు • ముక్కలొత్తి
తమ్మిరేకుల మోము • తమ్మిపై నడరించి, పోర్లతం దామర • తూఁడ్లుగట్టి
[illegible]నటిపడ తొడల • నడరించి మిక్కిలి, చన్గవ పూలగు • చ్ఛంబుల నిడి
వాతెరపైఁ గాలి • వన్నె లేజిగురుంచి, కరములఁ జెందమ్మిఁ • గదియఁజేయ
విరహ కారక మౌవస్తు • వితతి యొటఁ, బడతి వేదన బలువయ్యెఁ • బ్రాఁతయింటి
గోడ నలుకడఁ బోవుపూఁ • బోడిపైని, దూలములతోడ నాయిల్లు • గూలుకరణి. 40

వ. అంత. 41

తే. కమలములు నిక్కఁ గల్వల • గములు ప్రుక్క
దమము ముడిచికఁ జక్రమా • దెంబుఁ దక్క
లేఁటిగమి తక్కఁ దారల • తెరువు నొక్క
వెలసె రుచికెక్కఁ దూర్పున • వేఁగుచుక్క. 42

క. [illegible]కర [illegible]జన్య ప్రోషితపతిరీతి రేయి • పూబోఁడిమణి
[illegible] దాచె [illegible] [illegible] వశ్యమయ్యె • నొగిఁ జారలఁటన్. 43

సీ. శాఖికా విరహారిబు • నకు రెట్టిగావించె, బహుళమా కృకవాకు • భాషణంబు
చక్రవాకముల క • త్సాహంబు గాఁజేసెఁ, గమల నిర్యాతి భృం • గస్వనంబు
వెలయఁ బ్రాతస్స్నాన • విధి విప్రులకుఁ జెప్పె, నిబిడమౌ వాయస • నిస్వనంబు
ధరణీజనుల దంత • ధావన విధిఁ గూర్చెఁ, గోలఁదివిరారంగ ది • క్కులనరుణిమ
సదన సమ్మార్జ నాది సం • స్కారవిధులఁ, గానఁగాఁజేసె ఘనకపో • తీ నినదము
బ్రిమలు సుదతుల చీరెల • యొదవు జెదరు, గదురఁగాఁజేసె వాకిళ్ల • నొదవు తెలివి.

సీ. హరిదిగబ్ధి కరగ్ర • హణ వేది గారోద, యము నిశాభవ్యాపి • తమువళత్కు
ఖమ్ము రతోన్మల్లాభ • కాయమాన ముఖగ, పఙ్క్తి సత్తోరణ • ప్రతతి నీల
కంఠధ్వనులు వీర • కాహళరావముల్, తతపక్షినినదవా • ద్యములు భృంగ
సంభావనా ద్విజుల్ • చక్ర వివాహప, తులు కౌశ్యపి పురోహి • తుండుగాగ
గల్య శాలవయని దివా • కన్యఁ గూర్చి, హరితులాసంగ దిఙ్నలా • స్యాకరదళ
శతమణీ దీపవర్తి కాం • చన సుపాత్రి, యన సహస్రకరుఁడొప్పె • నంబరమున.

వ. మఱియు నిప్పాటున నమ్మేటి వెలుఁగు లేటదక్కి తేటకెక్కి ప్రాక్కూటి నాట నాటవాటులని పాటవంబున నూటిదప్పి నీటుకొప్పి పాటుగతుల నాటలధాటి కోటమిలేక పరువులిడు లీలాఘోటకంబులును హాటకాభరణాలై దీటుకొలుపు యంత్రవాటల చాటుగతులు గలిగి దాతువుల పాటిలు కూటుల సాటినొందు క్రీడాగజకోటులును నిరాఘాట వ్యాటీక తోత్రీకోటీరంబుల సుమనస్సుల వాటి పాటిత మరందకూటంబులై పాటలిత లలాటంబులై యామనివేటకాఁడు బైట మనోమృగా ఖేటంబునకు బోటొగ్గిన మాటులనం బనవి యాటలపాటల నీటుల నొందు తేటులును విదాగపు బోటి మనఃకాలకూటంబులై పాటీరసుమ వాటికా పేటికల నూటియున్న తావిసామ్మునంగొని నటనాపాటవంబున బోరాటనంబుగాఁ గోటరాగారంబులు దూఱ బూటకమ్మునఁ గొన్న సొమ్ము స్వీయంబొట కాటనధ్వజాండు లోటుసారసి వానింబట్టఁబంపు పోటుబంటులనఁ జెలంగు తేఁటులకందక మంజరీహాటక కవాటంబులు దీసి దాటుచున్న పిన్న నీటి తాతలతో మెలంగు పూదోటలును వాటంపుగతుల నేటుకొన్న వరాటంబుల కాటపట్టైన శృంగాటకంబులుగల నవ్వీట సుమాశధూటీశత వాటులును బోటు లాందోళమానమానసులై యున్నంతఁ గాటీరసఖీశ్రీనటీ విస్ఫురత్తాటంకగండార్భటీ కాసుంభ శాటికాంచిత సత్కటీ ముక్తాలలాటికా నవసత్రుటీ సౌందర్య ఫేటికా

జన సంకటి లావణ్య ధాటీకా స్వాలీకటి యని యొప్పుంబడు నొక్క బుద్ధిమద్వయ
స్యా శఘాటి యరకించి యప్పాటుగాంచి కైటభారి మదింబేరొక్కని యిట్లనియె.

క. శ్రీకాంత కాంత దోడ్కొని, శ్రీకాంతుఁడె చాలు దేవ • శేఖరులగు భా
షాకాంత శచీకాంత ది, శాకాంత ప్రముఖులైనఁ • జాలరనివెసన్. 47

తే. పగలు తొగలమగని • నగఁదగు మొగమున
నగులు బొగులున నయ్యాళి • మిగుల వగవ
నొగులు దగిలిన మగటిమి • మిగుల నగజ
నగధరుని తోఁడి మగువ లె • న్నగనుతించె. 48

ఉ. నన్నిటు సేయనీకుఁ బగ • నా పగవాపగ నాపగల్గుదే
వన్నిగ సన్నుతింప విన • వా వినవా వినవాతివాస్యమై
మన్నన సేయుమన్న ఘన • మా ఘనమా ఘనమానదేవ గో
తన్నినుఁజోల నేరఁగన • రా గనరా గనరా భజింపఁగాన్. 49

చ. మొనసి తలంపవిట్లు ఘన • మో వినమో మనుమోదమంది ని
న్ను నుతులుసేయువారిఁ దగ • నో పగనో వగనో తలంప విం
కనుమనులెల్ల వేమకొనఁ • గా వినఁగా మనుగావలెదె ము
న్నినుతి జనాళి నీకునెల • వే గలవే యిలవేల నీవొగిన్. 50

వ. ఇట్లు నుతించుచున్నంత. 51

ఉ. ఘన మణిరత్న ఘంటికల • కాంచి నితంబముపై ఘణంఘణ
స్వనమునదేరఁ గంఠమున • వజ్రపుఁ బట్టెడ కాంతులూర మే
ల్పనుపడి రాగిడీ మణి వి • భాసితమై దగు చంద్రవంక కాం
తలి మరియు చంద్ర సూర్యులు వి • శాల రుచి న్దనరార సాఁదలన్. 52

ఉ. కంతుని పాయకమ్మన ని • గన్నిగ కస్తురి రేఖ భ్రూముఖ
ప్రాంతమునందు రాజిలఁగఁ • బాపట బిందియలున్ ధగద్ధగ
త్కాంతుల మోముపైఁ జెరఁగ • గాంచన దీప్తుల చేరుచుక్క య
త్యంతము ఫాలమందొరగ • నందము గా నెలవంక తోడుతన్. 53

చ. అలఁదిన పుష్పతావి మరి • సానటకై యరుదేగ సత్ప్రభా
కలిత పదంబునందు ఘను • ఘల్లున వందెలు మ్రోఁగఁ గర్ణ భూ

షల బలునైగ నగ్యమౌ పా ♦ సంగి మహాద్యుతి దేగ మేలి స్వ
ర్ణ లలిత కంకణంబులు ఝ ♦ ణంఝణ నాదమునీఁగఁ జేతులన్. 54

చ. కుచముల బల్పు కంచులికి ♦ గొప్ప బిగింపును మించఁ జంద్రహా
ర చయము రమ్మునందున ద ♦ ళిత్తళ కాంతుల నింప వెల్లనా
పరిచురపు పాగడంపు కటి ♦ పై లలి చందిరపు రంగు జీబు మే
లురిచులను గాంచ బాహుపురు ♦ లున్మణిదీప్తుల నెంచ సందిటన్. 55

క. ఈరీతి హారయులు దేరఁగ ♦ నారామామణిని గూడి ♦ యాహరి బహు శృం
గార గతులఁ జరియింపఁదు ♦ పారాచలజాత వినుతి ♦ సయ్యన రాఁగన్. 56

సీ. నుడిపను వడుపున ♦ నెడనెడ కనుదడ, దడ యురువడి యెడ ♦ గడు నిగుడఁగ
చిడిముడి పడునని ♦ జడుపున దొడిదొడి, వెడలిన గడగడ ♦ యొడల డరఁగ
నెడనెడఁ దనువువెం ♦ బడిబడు చెమట పెన్, జడిజిమ్ము బెడగు న ♦ ల్గడ దడియఁగ
వడవడ వణకుతో ♦ వడివడిఁ బుడమిపై, దడబడు నడుగు పం ♦ దడిబడయఁగ
విడిగ|నడరెను తురు ♦ మడలిన బొట్టుతో, జడిమ గడగి కలిమి ♦ పడతి గడగు
మడుపులడగ బోడు ♦ మృడునిచెలియనుతి, నొడబడి బలువిడి గ ♦ రుడహయుండు.

సీ. జిగిబిగి మిగులగ ♦ నగుమొగ ములదగు, ముగుద గములు దెచ్చు ♦ ధగధగ ధగ
నిగనిగ గాఁజెడి ♦ తొగలమగని రాల, మగరాల మయము గా ♦ దగచు నెగడ
నగుగిన్నెల దెగల ♦ నగరుచ స్స్రుగమద, స్థగిత చందనము తో ♦ భగన వలఁద
దగులు బొగులులను ♦ మగువలు సొగసుగ, ధిగధిగ కంకణ ♦ దీప్తి వెలుఁగఁ
దగిన చామరంబు ♦ లొగివేయు నొల్లందు, దగఁ గలంగి యున్నఁ ♦ దగ గలంగఁ
డగజ మగనిబాపి ♦ నొగులున బొగల న, య్యగజ వగపు దిగువ ♦ నగధరుండు. 58

క. పలికెడి లతఁ బలుకక మతి, పలుకక యున్నయెడ మిగుల ♦ బలుకుచుఁ గలగా
బలుగా వెలవెలగావిల, విలగా వెలలేని వెత ద ♦ విలి కలవిలగాన్. 59

క. ధరచాప ద్ధరణకృతాఁ ♦ దరుడై, యారావ భీమ ♦ దరుఁడై స్మర సుం
దరుఁడై సద్భ్రిమ్మండో, దరుఁడై హరి గగనగతిని ♦ దా నరుగునెడన్. 60

క. హాహూతి వ్యాహారము, హాహా హూహూ ప్రముఖ మ ♦ హా గంధర్వ
వ్యూహా పంచీ నినదము, మాహేంద్వాహాన కథాక్ర ♦ మము నభ మడరెన్.

సీ. ఖేలా హృత స్వర్ణ ♦ చేలా గ్రకర రమా, నీలాల కామణి ♦ నిలిపి నిలిపి
సాలావళీ సౌధ ♦ జాలాంతరాలోల, బాలామణీదృష్టి ♦ బరఁగి పరఁగి
శ్రీలాలి తార్థేందు ♦ ఫాలా సమేత ది, క్పాలాఖిలస్తుతి ♦ బడసి పడసి
కీలాలగ చ్ఛక్ర ♦ లీలావిల ద్విష, త్తూ లావళిని బార ♦ దోలి తోలి
యచల తనయా చిరస్తుతి ♦ ప్రచుర రచిత, రుచిర వచన నిచయసుధా ♦ రచన నలరి
ఖచర నుతి నేగెఁ బిత్రుకాన ♦ న చరపురికి, విచలితాఖిల భక్తార్తి ♦ విష్ణుమూర్తి. 62

వ. ఇవ్విధంబునఁ గలువలుచెలి తెలివెలుగున మలినంబగు నలినంబురీతి హృన్నలంబునఁద నచెలికి విలవిలఁగ నెలవుకొని మెలఁగు బలువగు కలక పొలుపున గల యలయిక కల విలలు పొలయులుకల చెలువున వెలువరించి వెలిదిప్ప యల్లునివలెఁ దిప్పజేర నాప్రోల గల చిలకల కొలుకులు చిలుక వజీరు పూములుకులనఁ దోడి కలుకులతో నిప్పలుగుల దొరకొను పలుకుల వెలఁది చెలువుని గన్న బలుదొరయని వెలవలనిగుణంబులు గ్గడించి వెన్నెల మొలకలవలెఁ గలకల నగవుల నిట్లనిరి.

తే. సామి సామేను చేకొన్న ♦ రామ పొగడఁ
బాము నగదాల్పు దేగ ని ♦ ష్మామ మామ
లేమరో రాఁగఁ గుక్షిలో ♦ వాములగుచుఁ
దామరస జాండములు మ్రోయు ♦ నేమొ కంటె. 64

మ. అలమాణిక్య కిరీట మంగదములున్ ♦ హారంబులు న్గండలం
బులు వక్షోమణి స్వర్ణ రత్నవలయం ♦ బు ల్ముద్రికల్ నూపురత
బులు కౌశేయ పటాది దాల్చి మురిపెం ♦ బుంజెందు నిష్మేటినిం
గలంకరీ కనుగొంటె లోచన మనః ♦ కౌతూహలంబయ్యెడిన్. 65

తే. శ్రీనివాస మూర్తి ♦ శ్రీనటు దించుట, మంచిదేయనుచు వ ♦ చించె నోర్తు
శ్రీనివాస మూర్తి ♦ శ్రీనటు దించుట, మంచిదే యనుచు వ ♦ చించె నోర్తు. 66

సీ. చూపు క్రొన్నన విల్తు ♦ తూపు నందము మించు, రూపు చిల్క-వజీరు ♦ నేపణంచు
నవ్వు దట్టపు తెలి ♦ పువ్వునెవ్వగ నుంచు, మోవి తేనెల సుధ ♦ బావివించు
మోము కన్నుల విల్తు ♦ మామ నాపాదించు, జెక్కు-లద్దపు సిరి ♦ నుక్కు-డంచు
ముక్కు-సంపెగ విరి ♦ మక్కు-వచే నొంచు, గుత్తుక దరమును ♦ నొత్తిగించు

చేతశా చేతన సృష్టి ♦ ప్రీతిఁజేయు, ధాత యీతని నాభి సం ♦ జాతుఁడయ్యె
నీతరుణి యీతఁడే నాతి ♦ చేతఁబూను, నాతలిరుబోణి కనలోక ♦మాతగాదె. 67

క. శిల నాతిఁ జేసెఁ గరివెతఁ, దొలఁగించెను బోవనడఁపె ♦ ద్రుపదజ కార్తి
న్గలకుబ్జను సుందరియా, జలజాక్షి నొనర్చె నితఁడు ♦ శౌరియె సుమ్మా. 68

మ. వనజాతాక్షు డితండు దాశరథియై ♦ వైదేహి కై ఘోరమా
ననిలో రావణు ద్రుంచి పుష్పక విమా ♦ నారూఢుడై తొల్లి టన్
జనుచో వానర వైత్య కామినుల వాం ♦ ఛ న్బిల్వఁదో నేగిరా
మనలం బిల్చిన నేగమా హరిదిసు ♦ మ్మా పక్షపాతం బొగిన్. 69

మ. తముబల్మిం జెరబట్టి పాలునవనీ ♦ తంబాజ్యము ల్చెర్వులు
ద్రమణీనీతనయుండు ద్రావె దినెఁజౌ ♦ ర్యంబొప్పగానంచు ద్ర
త్రక్రమముం దెల్పఁగ గొల్లచేడెలు యశో ♦ దంబల్కి రస్మన్నిశాం
తములం దట్లొనరింపఁ దెల్పుదుమెత ♦ త్తశౌర్య మంచెన్నగాన్. 70

క. తనముఖశశికై తత్పుర, తనుమధ్యాం బక చకోర ♦ తతి రాఁగావ
చ్చెను శౌరి హరాంతఃపుర ♦ మునకు హరాంతఃపురంబు ♦ ముదమున నెదురన్.

సీ. కమలామనోనీల ♦ కంఠ నీలాపద,పదరమాజిత శత ♦ పత్రవిభవ
భవధాతృదేవ ది ♦ క్పాల స్తుతి విశేష, శేషకులారి ప ♦ క్షిప విమాన
మాన ధనోగ్రారి ♦ మాన ప్రమథన ధ, నాధిప సమభాస్వ ♦ దతివితరణ
రణరంగ వినిహత ♦ రక్షోవనీరాజ, రాజమానైశ్వర్య ♦ రాజమౌళి
మౌళి మణిరాజి జితనభో ♦ మణి వరకర, కరసరోజ నిదర్శిత ♦ జ్ఞాన ధామ
ధామ పిహిత త్రిలోకారి ♦ నామయనుచు, వనజ నయనుని మనమున ♦ వినుతిఁజేయ.

తే. మంద్రనుతివాక్యముల నచ ♦ లేంద్ర భవ య,తంద్ర మానసనియమయ్యె ♦ తనుభజింప
సాంద్రమగునత్తరుణికోర్కె ♦ సంద్రమునకు, పేంద్రుడుసుచంద్రికాతత ♦ చంద్రుడయ్యె

వ. మఱియు ముకుందుండు తనలోన. 74

తే. లేఁడుతనచెంతఁ బతిరాక ♦ జూడుమనుచు, వేడుఁనుమసన్నుతులఁచేత ♦ వాడునన్ను
జూడుమాయలఁ గఱపక ♦ వాఁడు పాడు, గాఁడుశర్వుండు వేవేగ ♦ రాడు నేడు, 75

తే. కాహళం బూను వేషంబు • కమలజునకు
తాళకాని వేషంబు త్రి • దశ విభునకుఁ
బెద్ద దాసరి వేషంబు • పేర్మిఁ దనకు
వెలయఁ గనక భూషాంబర • వేషి యగుచు. 76

సీ. నడిచెనా మణిమయ • నానాభరణ రుచుల్, మిత్రాత్రిపులకు మిరు • మిట్లుగొల్పఁ
గదలెనా ఘంటికా • ఘణఘణా త్కారంబు, శేషాహిచెవులకుఁ • జెవుడు సేయఁ
బరుగెత్తెనా తమ • పురణికి నెగయునో, యని సురలకు బెగ • డానుచుండ
నాడెనా యాటయం • ద ధికనైపుణిఁ గాంచి, యచ్చరలకుసిగ్గు • హెచ్చఁజేయు
నగధరుఁడు మేళమున నేత • యగు కతననొ
తాళగాఁడయి యింద్రుండు • దగు కతననొ
యబ్జజుఁడు కాహళంబూద • నగు కతననొ
తగిన గతినొప్పె గంగిరె • ద్దగుచు నంది. 77

తే. కాహళము చంక ఘంటిక • కరము వంక
వేణు వొక మోలమోమున • వివిధలీల
మించు తిరుమణి బొట్టుచే • న్నీసకట్టు
తరుణి మంజీర మేక పా • దమునశౌరి. 78

తే. మీసమున నాసికామణుల్ • మించి యాడ
దాసరుల వేసములఁ దాల్చి • వాసవాదు
లోసరక మేళమునను గ • జాసుర పుర
భాసుర నృపాయనమనఁ జా • పట్టి నడువ. 79

వ. ఇవ్విధంబున శ్వేతోక్షిప్త తరంగంబులును నూర్ధ్వ పుండ్ర ఫేనంబులును వాద్య ఘో
ష ఘోషంబులును వాద్య నగంబులును కాహళ సర్పంబులును ఘంటా కచ్ఛపంబు
లును వేణు మచ్ఛంబులును ఢక్కా మకరంబులును హారమణి మణులును నానాభూ
షణ జలజంతువులును మాయా శైవాలంబును మనోభిప్రాయ గాంభీర్యంబును నీలకం
ఠుక ప్రబోధకంబులునుం గలిగి బలిమల్లునికై దైత్యమల్లుని వీధి మతల్లిక నరుగు న
ల్లునింజూడ వెల్లువయగు కోర్కె లుల్ల సిల్ల నేతెంచు సరిద్వల్లభుండన మేళంబు దన్న

వెంట రాఁగ వారిజాక్షుండు ధాత్రీజన పవిత్రంబులు నైన విచిత్ర చరిత్రంబుల రాత్రిచర గోత్రజాలు బెదర బంగరు రంగులు పొసంగు మైమెఱుంగు హొరంగు కనంగొను వారు చెలంగి కలంగి తలంగక నిలఁగఁ దాముంగలరై రక్షో గృహంబు జాడ నరుదేర సార తారహీర హారలగు నారీమణులు తోరంబులైన కోరికలు చేరుకొనఁ జూచుచున్నంత. 80

శా. ఘంటా కాహళ శంఖ దుందుభి మృదం • గ ధ్వానముల్ హెచ్చి మి
న్నంట న్దత్పురి రాజ మార్గమున నా • య్యారంబు దీపింపనా
వెంట న్వచ్చెడి దంభవేష హరిఁ బ్రా • వీణ్యంబుతోఁ గాంచె ము
కఱ్ఱంటి న్గద్దువ నుంచు మేటి యసురా • గంబు తఱ్ఱటంబై తగన్. 81

క. శుంభ త్సంరంభంబునఁ, గుంభిదనుజుఁ డపుడు చూడఁ • గూరిమి నటనా
రంభుండై రక్షస్సభ, నంభోజాక్షుండు శంఖ • మత్తఱి నొత్తెన్. 82

వ. ఇవ్విధంబున శంఖంబొత్తి తనమేళంబు సందర్శనాగత పురచోళీ చూళీ కేళీ సుమమాళీ మధూళీ భృంగాళీ గీత పాళులతో వేణు వీణాది ధ్వనుల దితిజాలకు హేళి సేయఁ దన్మౌళియై బలుమాయల గలపక దైత్య బలంబు కొలఁది తెలిసి కలసి యలసి సొలసి బలిసి మెలసి వలసి విలయింప నలువకు నలవి గాదనుచుఁ గిలకిల నగి కిలికించిత రసంబు జిలుకు ముద్దుగులుకు బలుసుధ లొలుకు పలుకు లలుకఁ గలకలంబునఁ గైవారంబు వెలయించి ఘోటీ ఖురకోటీ పుటపాటిత శతకోటీ వ్యాటీక బలాటన రిపువాటీ రణధాటీ పాటీగ పరాగారీ వధూటీ కుచశాటీ కోటీర వికంపన పరిపాటీ జయధాటీ యను జయజయ శబ్దంబులం బొగడి శారద నీరద పారద శారదా తారాప తుషారామృత ధారా ఘన సాహోన్నత హీర క్షీరాంబునిధి తుషారాచల సీరపాణి శౌరఘుకి సునాసీర కరి త్రిపురారి పురారి గిరి గజారి దానవారి తరులనంబరఁగి నితాంత శైత్య భావంబునఁ దద్యశః కాంతా తిలకంబు కకుబంత విశ్రాంతిం బొల్చెనని చిత్తం బుత్తలపడం జేయుచు వేణు కాహళాది ధ్వనుల నృత్తంబు సేయునంత. 83

సీ. ఒకచోట నాట వేఁ • డొకచోట పాట రొయిం, డొకచోట మాటదాఁ • డొక్కఁడరయ్యో
నొకచో నొయూరు వేఁ • డొకచోగతుల వాదు,లొకచో జతులతీరు • లొక్కఁడయ్యో

నొకచోటఁ దాళంబు • లొకచోట మేళంబు, లొకచోటఁ జాళమై • యొక్కఁటయ్యె
నొకచోటఁ గంతుపే • లొకచోఁ జెలంతులో, కొక్కచోటరంతుదా • నొక్కఁటయ్యె
హెచ్చి దాసరు లొకగంగి • రెద్దుఁ దెచ్చి
నచ్చి యాడింపఁ జూపర • కిచ్చ మెచ్చ
లచ్చి చెలువుకు సురలతో • వచ్చి నంది
నిచ్చ నాడింప నచ్చెరు • వేరికిడదె. 84

తే. మెచ్చితిని మిమ్ము మీకోర్కె • లిచ్చెదనని
మచ్చికల రక్కసుఁడు బల్కె • లచ్చి మగఁడు
నచ్చెరువు దోఁచ నీనంది • హెచ్చి యాడె
నెచ్చుగా దాని కోర్కెల • నిచ్చి పుచ్చె. 85

తే. తనదు హృదయంబు లోనికిఁ • జని హరుఁగను
మనుచు నందితో నాదైత్యుఁ • డనఁగ నంది
వడిగ లోఁజనఁ గంఠంబు • వ్రిస్సి వాఁడు
నొచ్చె హరుఁడాత్మ గిరికినై • వచ్చెనంత. 86

క. అంతట దంతురతాంత దు, రంతా యాసాధ్య తప్త • రాంతిక కాంతా
స్వాంత నివసద స్వంతక, సంతాపము శాంతి సేయు • సంతస మొదవన్. 87

ఉ. శారద నీరదంబు పయిఁ • జంచల భాతికటిం బిళంగ మాం
జీరమ రొప్పు దేవ సర • సీ సిత వారిజ రాణ్మ రాళ రే
ఖారుచి రీతి జన్నిదము • కంఠమున న్దొదఁగప్ప వీపునం
న్షైరిన స్యంతుకృత్తి శశిఁ • జెందు కళంకము రీతి నొప్పఁగన్. 88

ఉ. తూరుపు కొండ దెగ్రిళ్ళి ప్రభ • తోఁ జరమాద్రికి నెగు వేళి ము
న్నారి పదంబు మీఱి హర • శైలము జేరుటఁ గాన మెన్నఁడీ
కాకరణ మేమటంచుఁ బ్రజ • గాంచ మహాపరిధ నింగినుండి వే
వారదుఁ డేగుదెంచె నగ • నాథ తనూభవ యున్న చోటికిన్. 89

క. ఘన వాగ్వృత్తి తిరీవర, మున శిరశకథాబ్ధి దేలు • మునులను నూతుం
డను నాపతి పశ్చాత్కథ, యను జలనిధిఁ జాగ్రికరథాని • లాహాతి ముంచెన్ 90

క. శమిత మహా సురజాలా, సుమశర నిభ దేహలీల ♦ సుందర చేలా
కుముద ప్రియార్ధ ఫాలా, కౌమర పురీపాల వేణు ♦ గోపాల శౌరీ. 91

తోటకము.

సనకాది మహాముని ♦ సన్నుత స, త్కనకాంబర సంవృత ♦ గాత్రరమా
వనితా మతివారిజ ♦ బంభర స, జ్జన కల్పక దాస వి ♦ శాల కృపా. 92

మ. గరుడ శ్రేష్ఠ విమాన మాన ఘన సం ♦ గ్రామైక నాశంకరా
కర మూలక్షితి చక్ర చక్ర హత ర ♦ క్షస్సైన్య పాళీ శరా
శర తారేశ పయోబ్ధి కీర్తి పిహిత ♦ స్వర్లోకలోకాపరా
పరమ శ్రీ విభవాభవ ప్రబల క ♦ ల్పా కల్పనా సుందరా. 93

గద్యపద్యము.

మ. సరసాశ్చర్య చరిత్ర కీరవట వం ♦ శ క్షీరవార్ధి క్షపా
కర నారాయణ సూరిరా డ్రచిత మాం ♦ గళ్య ప్రబంధాధిరా
జరమా భర్తృకథా గణోదయ విశే ♦ షాఖ్య ప్రబంధంబునన్
హరి చాతుర్య కథా విలాసము ద్వితీ ♦ యాశ్వాస మింపొందెడిన్.

శ్రీ శ్రీ శ్రీ.



  

శ్రీమద్గురుభ్యోనమః.

# గణోదయము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీలాలిత కౌమర పురీ, పాలా సోమార్ధ సదృశ ♦ ఫాలా కరుణా
శీలా వైరిజన ప్రతి, కూలా మునిలోల వేణు ♦ గోపాల హరీ.

వ. అవధరింపు మట్లడిగిన నూతుండు.

సీ. శిష్టత గాంచి య ♦ నష్ట నైజప్రభా, స్పృష్టి నద్యుతి ఖర ♦ ఘృష్టిధర్మ
దేష్ట యమ్మని రాగ ♦ సాష్టాంగ మొనరించి, స్పష్ట పుణ్యగుణ సం ♦ శ్లిష్ట మునిని
మృష్టాశియై చిత్ర ♦ తుష్ట మణిప్రభా, పుష్టగేహమున న ♦ భీష్టగతుల
నష్టాప దోత్కృష్ట ♦ విష్టప త్రయశిల్ప, సృష్టి విష్టరస ని ♦ విష్టఁజేసి
దిష్ట గతి నిష్ట ఫలదాయి ♦ యష్టమూర్తి, క్లిష్ట తగదుష్ట హృదయ ని ♦ విష్టుడయ్యెఁ
గష్ట మునుమాని రాసుధా ♦ వృష్టి దృష్టి, నిష్టిగా నాకనిష్టత ♦ నిష్ట మిడవె. 3

క. మునివిగదా నియమములకు, ఖనివిగదా కాంచు జనుల ♦ కలుషమణఁప గో
ధునివిగదా నిన్గనుఁ గొనఁ, దనివి గదా మాదృశులకు ♦ దాపసవర్యా. 4

క. కనరాదొకో వినరాదొకో, యనువారి కన నర? హరున ♦ కనువా యనుచున్
ప్రదెనవారా యనువారును, మనవాడను కొండ్రెడి శంక ♦ మనవాడలలోన్, 5

క. ఏమీమది నివ్వెఱలే, దా మీకిది యొగ్గుదోచ ♦ దా మీవైనా
నేమీగతి గామీరెను, నామీదను హరుఁడు గనలు ♦ నా మీరెఱుఁగన్. 6

క. అంతా నింతా నవఁదగ, దింతా నంతా నటంచు ♦ నెనదగ దిపుడీ
వంత యనంతంబైనా, పంతై యింతయ్యె నెంత ♦ పలుకుదుఁ దెలియన్. 7

క. అనవిని వనితనుఁగనుఁగొని, మునిపలికెను గొనకొని మన ♦ మునను దదార్తిన్
మనకనిశము ఘనముగఁ జను, వనజనయను కృపను గనిన ♦ వనజ నయనరో. 8

క. ఇదివినమిది గాదిది తే, దిది వలదిది బాగు జెంద ♦ దిది నగుబాటౌ
నిదియనమిది గనమిదిగొన, మిది యొనగదయిది యొదగద ♦ హీనత ధరజా. 9

క. ప్రోక లనేకములై యీ, లోకంబున గలవు వాని ♦ లోఁగానముగా
నీకాంతుని రాకడలివి, లోకాతీతములు మనము ♦ లోనమ్ము మిఁకన్. 10

ఉ. రమ్మని నెమ్మితోఁ జెలి స ♦ రాగము లెన్నక కినుకచే మతి
న్నమ్మతిలేని భర్త సర ♦ సమ్ముగఁ జూచునె వానిపొందు దూ
రమ్మనుకొమ్ము నీపతి శి ♦ రమ్మునకెక్కె విషమ్ము కమ్ముగా
నమ్మకు వాని నెన్నడు గ ♦ నమ్ము వినమ్మి దివమ్ము సుమ్మొగిన్. 11

ఆ. వారణాసుర గర్భంబు ♦ దూర నేమి, కారణము నీపతికిఁ జారు ♦ సారసాక్షి
కోరిక లాసంగు వారికీ ♦ తీరుదగునె, బారె నాతిని మది విపా ♦ హారమునను. 12

ఆ. గద్దరి తనంబు చేఁ బెద్ద ♦ యెద్దు నెక్కు
తద్దయుఁ జరించు పతియెడ ♦ వొద్ది కగునె
ముద్దరాలరో యీసుద్ధి ♦ గద్దచెప్పి
పెద్ద లిది హద్దనక దిద్ద ♦ వద్ద నీకు. 13

సీ. అతినింద నీముందు ♦ హరునం దిడఁగ నందు, గనలొందు దని గుందు ♦ గందువాని
నెంచఁగా మెయి విలో ♦ కించగా గుణమాల, కించఁగామి గుల వ ♦ ర్ణించఁగాదు
గుమలిద్చుటను హెచ్చు ♦ కొనివచ్చు మదినొచ్చు, పెనఁగచ్చు లతనిపై ♦ బెంప నేల
యని హితగతిని న ♦ ర్ధాంగీ కృతంబైన, దాంపత్య భావంబు ♦ దగులుభాతి
నాతి యీనీతి తొలిఁ బ్రాత ♦ చేతఁ జెల్లెఁ, దాతనీకు మహానగ ♦ నేతభాగ్య
దాత నీవాతనికిఁ బ్రీతి ♦ కూఁతురవయి, భూత పతిపొందు నొందవి ♦ ఖ్యాతిగాదె

క. చాలుఁజాలును భక్తాను ♦ కూలలీల, బాలుపడి నీవు వ్యధకర ♦ క్రీలజేసి
పీలుకొర్చుర హృదయాను ♦ కూలుఁడయ్యెఁ, గాలుఁడనరాదె నీప్రాణ ♦ లోలునరయ.

సీ. అంచయానరో నీదు ♦ మించిన నుతులను, బంచేషుగురుఁడు మ ♦ న్నించి మది స
మంచిత దయతో వి ♦ రించి శక్రాదులు, సంచిత దివ్య వే ♦ షాంచితులయి
నించి తోడ్పడఁగ నే ♦ తెంచి మేళమున మె, ప్పించి యాటలను వం ♦ చించి దైత్యు

మంచి గాఁ దదుదర ♦ సంచరద్భవు వెడ, లించె నాతండు హ ♦ ర్షించిమించఁ
గొంచె మనియెంచి యిదిమది ♦ నుందుకొని త
లంచకుమి వంచన పతిగా ♦ వించె నిన్నొ
కించుకంతయుఁ గొండగా ♦ నెంచి వచ్చి
మంచు తెలియఁగునఁ దేలె నే ♦ మంచుఁ బలుక. 16

క. అతులిత గతిఁబలికెడి యతి, పతి వార్తలు నిజములైన ♦ పతివార్తలుగా
నతివ దలఁచి ఘనచింతా, రత మానస గా నెఱింగి ♦ తాపసి పలికెన్. 17

క. పల్లవశయ కొల్లగజను, వెల్లిగ నీముదపు పాల ♦ వెల్లిప్ర బలఁగా
నుల్లము రంజిల్లఁగ నీ, వల్లభుఁ డదె యెల్లి యొల్ల ♦ వారుల్లసిలన్. 18

క. అతని సమాచారం బిది, యతివరో యనిసతికి వెతన్ ♦ హితముగ మునిసం
తతగతి జితాతి బలుఁడై, ఖతలమునకుఁ జనియె గగన ♦ గతతతి పొగడన్. 19

క. ఓగిరము పోరు సతతము, గాఁగలిగిన యోగివరుఁడు ♦ గాగనగతి ని
ట్లాగతి వాగశయానుని, శ్రీగల పోలికను నరుగ ♦ శ్రీగరిమను దాన్. 20

క. ఎదురేగి ముదము గదిరెడి, మదియొప్పఁగఁ దోడితెచ్చి ♦ మానీంద్రుని స
త్సదనాంతర హర్మ్యస్థిత, సదన సువర్ణాసనమున ♦ సాధ్వి నిలుపుచున్. 21

సీ. ఓమునినాథ నీ ♦ వేమెఱుంగవు గదా, యామాధవుని వార్త ♦ ప్రేమ యొసఁగ
గాముల బలము నా ♦ కేమి కొఱంతొనన్, దామరసాక్షుఁ డీ ♦ పేమ నునిచి
సామజ కర్బురో ♦ ద్దామ మహానుతి, స్తోమంబు చే నభి ♦ రామముగను
వామదేవుఁడు త ♦ తాక్రమదుఁడై యేగి, యామిషాశన కుక్షి ♦ ధాముఁడైన
హైమవతి దా మొనసిచేయు ♦ సామ వినుతి
భీమ శైలంబునకుఁ జనె ♦ క్షేమ మొదవ
మీమది కెఱుంగఁ దోచిన ♦ యోమునీంద్ర
యామహాత్మ్యం డిటకు రాఁడి ♦ దేమి చెపుమ. 22

క. సతి యీగతిఁ బలికిన యతి, పతి యతులిత హర్షమతిని ♦ బలికె హితవుగా
విశతమతి ధృతి విజిత గ్రీ, ష్మతి వసుమతి ధర సుదతికిఁ ♦ బతి నిజవార్తన్. 23

సీ. మేటిదై నీద వ ♦ నాటాంగములు దాల్చె, బుచ్చివాఁడై బలి ♦ బిచ్చమెత్తె
నిక్షత్రముగఁ జేసె ♦ నిఖిల ధరాస్థలి, వాలి నాడల నింద! ♦ వాలి సోలె

ఖ్యాతిని బోనాడి • చేత నాగలిఁబట్టె, వల్లవీమతులనుఁ • గొల్లఁగొనె
మానినీమణి చేరఁ • బూనిన జన్మంబు, పైనెత్తగా నుండెఁ • బ్రజ్ఞ విడిచి
యెల్ల పుణ్యజనులతోడ • వెల్లిగాఁగ, కొల్లకొల్లగ ననిఁజేసె • నుల్లమగలఁ
బల్లవాధరులను గూర్చె • మల్లడిగొన, నెల్లెడల మీపతికి నిట్లు • చెల్లు నటవె. 24

ఉ. తప్పున నొప్పుమప్పతన • తప్పని యప్పరమేశు గొప్పగాఁ
జెప్పిన మెప్పుగాదు మఱి • చెప్పని చొప్పది రప్పుపోదు నీ
వొప్పుల కుప్పవౌదు నెద • నొప్పక యాతనిఁ ద్రిప్పఁ దప్పగా
గప్పవశంబె గప్పినను • గప్పున యిప్పని దెప్పనేటికిన్. 25

తే. అగ్గలిక డగ్గరనివాని • సిగ్గు చెడఁగ, తగ్గు లెన్నుట మనమొగ్గు • కగ్గునైన
నగ్గరుడవాహు నగ్గింప • లగ్గు చెంద, దగ్గి దినువాని తో నెన • రెగ్గుగాదె. 26

సీ. హరి దూషణపు భాష • యతిదోష మిఘోష, వలదు నీకని పలుకఁ • బడిన బడుదు
గాని నీవూని శ్రీ • జాని దాఁబూని సు, హాని కార్యంబులు • వానియున్న
దాన బింబోష్ఠిని • ధాన సాధ్వివినీవు, గాన తత్పతి నను • మాన మూన
కెద కక్కు గడునిక్కు • మదిచిక్కు నటుసొక్కు, మఱివిక్కు విరియుదు • మమత జిక్కు
యొకుక్కుడుగఁ గోమలులఁ బడ • నొక్కువాఁడు
వక్కు పక్కని జక్కగా • నెక్కువాడు
రక్కసులఁ బెక్కుమాయలఁ • జెక్కువాఁడు
మిక్కుటపు మక్కువుంచుట • నిక్కమగునె. 27

తే. రూపరక నీపగిదిఁ బలుకు • నాపలుకుల, కోపలే కాపణతి యెద • కోప మొదవు
చూపుచేఁ దమ్ముఁ గనుఁగొన • దాపసుండు, మోపమొప్పని పలుకులఁ • జూపిపలికె.

క. నీపతి గాంభీర్య జితధు, నీపతి ముఖవిజిత యామి • నీపతి శర్వా
ణీపతి దెచ్చెను బహుశః, నీపతి తేజమున వాహి నీ కతిదాసై. 29

సీ. వాసవా ద్యారలెల్ల • వాసిచే నెన్నగై, లాస వాసాస్య వి • కాస మెసఁగ
దాసావన మహా వి • లాసంబు లేర్పడఁ, గోసు జెందని జయో • ల్లాస మొదవ
దాసిన పతి నెడ • వాసి వేసట నొంది, దోసి లొగ్గుచు గృత్తి • వాస తరుణి
మోసి చేసిన నుతి • నీసు చెందక గొని, వేసంబుచేఁ బెద్ద • దాసరియయి
వాసవాదులతోఁ గూడి • వాసు దేవుఁ, డాసవద్వేషిఁ దెచ్చుట • భాసురగతి
నోసి నీవల హార్యరో • వాసి యనఁగఁ, జేసినను జెల్లెఁ గా యిది • భాసురాంగి. 30

క. నారదుఁ డంగద్యుతి జిత, శారదుఁడు కుతంత్రి వాగ్వి • శారదుఁడు తపో
భారదుఁడు కుందకుట్మల, భారదుఁడు స్వకీర్తి విజిత • పారదుఁ డరిగెన్. 31

వ. ఇవ్విధంబున దారి కాపుఁదపసి తమ్మి కొంపగల కంపాలతాంగికిఁ గెంపుకన్నుమేటి చంపకనాసకు సంపాతి తానుకంప మానసుండవఁ దెంపులోని తత్రుంపు పెంపు గని పింపఁ జేసి గుంపుగుంపులై నిలింపులు సేవింపఁ జారణులు వినుతింప నలువపడఁతి మతి సంశయమడంప దరికరుగ నమ్ముద్దియ నిద్దంపుటద్దంబులద్ది మణులగుద్దిన యొద్దికలుగల పైడిగద్దియను మునులపెద్ద నునిచి గ్రద్దన ముద్దులగు సుద్దులు తోడి చెలులు దెల్ప వద్దన హద్దులేని యాధి రద్దుసేయ నిట్లనియె. 32

ఆ. హరిని గూడి యరిగెఁ • బరమేష్ఠి వారణా
సుర విరోధిఁ దేఁగఁ • ద్వరిత గతిని
బరఁగ రాఁడు మీకు • సెరుక గద్దిపతి
తెలుఁగు దెల్పవయ్య • సురమునీంద్ర. 33

క. వీణాంచిత కిసలయ మృదు, పాణివి నీలాభ్రవేణి • భాసుర పులిన
శ్రోణీ స్వవాణిజిత పిక, వాణిన్వాణిఁగని మౌని • వరుఁ డిట్లనియెన్. 34

ఉ. వల్లభు పెల్లునిందలను • వల్లభి యుల్లము తల్లడింపఁగా
జెల్లదు చెప్పఁ గల్లయయి • చెల్లును పెల్లువ నిందయైన యో
పల్లవపాణి నివ్విడిచి • పల్లదనంబున నీధవుండు శ్రీ
వల్లభుఁగూడి యేగె నిటు • వంటివి తల్లవె తొల్లి యెల్లెడన్, 35

క. నీదయితుఁడు తేఁజనియె మ, హాదేవుని నిన్నువిడిచి • యనుమాట విన
న్మోదంబై శ్రీదంబై, ఖేదంబై తనరువాని • కిందగవగునే. 36

ఉ. అన్నలినీధవుండు సరి • యన్నుల సన్నుతి నెన్నఁగా నినుం
గన్నడ చేసి యేగెనిది • కన్నది విన్నది లేదుమున్నుగా
కున్నను వన్నెచిన్నెలవి • యున్నవె యెన్నఁడు రావు వానికై
నిన్ననవేల నెన్నికల • నిన్నటి మొన్నటి వాఁడె వాఁడొగిన్. 37

తే. అండ్రిగా గొల్లలగు జవ • రాండ్రఁ గూడి
తండ్రి పుండేరీక్షు దశలచే • గండ్రిగాఁగ
వాండ్రు చిందుగ్రఁ దలఁచి తా • వేండ్రిముప్పఁ
బాండ్రి పనిఁజేసె నీపతి • తీండ్రిముగను. 8

ఆ. ధవుఁడు దుర్గుణుఁడైన య ♦ త్తరుణి దరిని
వలదు దూషింప భూషింప ♦ వలయుఁగాని
యేను నీమత మెఱుఁగక ♦ యిట్టులంటి
నబ్జజుఁడు వచ్చునని ముని ♦ యరిగె దివికి. 39

ఆ. కార్తికేయగురునకు ఘో ♦ రార్తిఁ ద్రుంపఁ
బూర్తి మతితోడ శ్రీవిష్ణు ♦ మూర్తి చనిన
స్ఫూర్తిమీఱంగ హరిచనె ♦ వార్తలేల
కీర్తనాతాళ శబ్ద ప్ర ♦ వర్తి యగుచు. 40

సీ. వీఁడు నా పతియనఁ ♦ గూడునా నీకు రా, వేడునా నీవంటి ♦ వెలఁది వానిఁ
బోలునా పతినీకుఁ ♦ జాలునా యెనయఁగాచు, నేలునా నిన్నిఁక ♦ నిట్టివాఁడు
మించదే యయశంబు ♦ గాంచదే న్యూనంబు, మంచిదే తలపోయ ♦ మగువ యతని
వింటివే మున్నిది ♦ కంటివే యెందైన, నుంటివే పతితోడ ♦ నువిద యిట్లు
చక్రికుచ నిన్ను దిగనాడి ♦ చక్రితోడఁ, జక్రిభూషణుఁ దేగ నా ♦ శక్రుఁడరిగె
శుక్రినయ నీకు బాగని ♦ ర్వక్రిత నిది, ప్రక్రమము గాదు కలవుత ♦ వక్రగతులు.

సీ. అనవుడుఁ దనువిని ♦ బెను గినుకను గనుఁ, గొని నలిననయన ♦ మునికి ననియె
వనజనయన సుతు ♦ షును తనయుఁడవగు, దనియని మనమునఁ ♦ గనితి వినితి,
ననయము కలహమ ♦ శనమునఁ గొనుదని, వినినను నిను విను ♦ తిని గొనుదునె
మినుసికి దేవరఁ ♦ గన హరి జనినను, బెనుపడి నాపతి ♦ చనుట యెగ్గె
ఘనగి తంత్రపు మినుకుల ♦ వినని కతన
మొనసి తనమాయఁ గనుఁగొనె ♦ ననుచు నరిగె
ముని కనుకని నిజాశ్రమ ♦ మునకు వేగ
ఘన హరి మనువు మనమున ♦ ననుమతింప. 41

సీ. అంతట నిటలాక్షు ♦ కాంతాశిరోమణి, వాంతఖేదమగు స ♦ త్స్వాంతమలర
మంతనంబున రమా ♦ కాంతుండు పొగడఁగా, నంతంబులేని సా ♦ మంతము కడు
బంతంబులఁ జెలంగఁ ♦ గంతువైరిని నాడు, చెంతఁ జేర్పఁ జనె ని ♦ తాంతమనుచు
నింతింత యనరాని ♦ సంతసం బొప్ప శు, ద్ధాంతం బలంక్రియా ♦ నంతగాగ
వింత వింతగఁ జేయించి ♦ ప్రాంతముగను, దొంతులుగ నింతులెల్ల చా ♦ మంతిపూల
బంతు లాడులుతోఁ గ్రింత ♦ చెంతనుంచ, నంత లంతలఁ గొనియుంత ♦ కాంతకలిమి.

క. అత్తఱి నభ్యంజనమిడి, చిత్తరులు వలుంగు లిడిన ♦ పిష్టము ప్రాణా
యత్తపుఁ బాంచాలిక గా, సత్తనయుఁ డటంచుఁ బెంచె ♦ క్ష్మాధరజదయన్. 44

క. తోరణ శృంగార రచిత, తోరణమున నురము మీరి ♦ తోరణమునకై
దూఱక వేసారక మది, దూఱక తారక మనమున ♦ దోరకవత్సా. 45

తే. వెలఁది యిటుపల్కి చనుదెంచె ♦ జలక మాడ
జలజనయనుండు సురపతి ♦ నలువ మొదలు
స్వీయ లోకంబులకు వేగఁ ♦ జేర రుద్రుఁ
డెలమిఁ జెన్నొందఁ దాలోని ♦ కేగు నెడను. 46

క. రుద్రాణ్యా క్షుద్ర కృపా ♦ ముద్రిత భద్ర తనుయోగ ♦ మున నచ్ఛిద్రో
పద్రవ తద్రుద్రగతి రి, ద్రాణము చేసి నతఁడు ♦ లీలం గేలన్. 47

వ. ఇవ్విధంబున నష్టుకొనిన వానిం గుండల్యాఖండల భూషణుండైన చండీశుండు దండధరోద్దండ చండకోప వ్యాప్తుండరీకుండై సుతుండని తెలియక యఖండ తేజోమండల ప్రచండకోదండ టంకారంబుదండియై పద్మజాండభాండంబు నిండుకొనఁ జండిత వైరికాండంబగు కాండంబున మెండగు రక్త ఖండషండంబు లొండొండఁ దండంబులై తుండంబున నుండి గండుమిగిలి భూమండలంబు నిండి యుండ శిరఃఖండనంబు చేసి యరుదెంచుతఱి నయ్యంగన బంగరుఘటంబుల మంగళోదకంబుల నాడి శృంగంబులఁ బోలు కురులు చరమాంగంబునఁ జెలువారఁ గురంగాక్షు లంగజస్నేహంబున వలితుంగఁ దడిదుడువ శృంగారియై యెదురేగి బంగరు శయ్యలఁ బ్రవేశించి యున్నంత. 48

క. బాలుఁడు రాఁడని మిక్కిలి, బాలామణి వగవ నెట్టి ♦ బాలుండనుచున్
ఫాలాక్షుండవ నలుగున, బాలునిగాఁ జేసితివని ♦ పార్వతి పలుకన్. 49

క. ఏలోనికి జన వడ్డొ, బాలుని హింసించితినని ♦ పలుక మరల న
బ్బాలుని బ్రతికించు మనన్, బీలుదితిజశిరముఁ బెట్టి ♦ బిడ్డగఁ బెంచన్. 50

సీ. నిటలాక్షు నూనుఁడు ♦ తక్కట కార్య లంపట, నటనుఁడై విస్ఫుట ♦ పటుతరగతిఁ
జటుల జవంబున ♦ నటునిటుఁ దిరుగుచుఁ, గొటిక తనంబు ప్ర ♦ కటము గాఁగఁ
జటుపటు సద్భృత్య ♦ పటలముల్ తృటితి వి, కటకటంబుల కట ♦ కట పెటపెట
పటపట ధ్వనులఁ బ్ర ♦ స్ఫుటగతి మెఱుఁచు, ఘటకులా విద్యుత్ ♦ ఘటలఁ బట్టి

ఆ. చిటచిట చిట వ్రిస్సి • నిటల తటంబుల, బొటబొట బొటరక్త • పటల మొలుక
గుటగుటమని ప్రాణి • పటముల్ ఝల్లంగ, మిటమిటగను శౌర్య • పటిమ నెఱపె. 51

తే. గంటు లేనట్టి పెనుపొట్టు • బంటుతనము
మింటికిని మంటి కొక్కటై • యుంటవైరి
కంటకుండయి పరఁగి ము • క్కంటి బిడ్డఁ
డొంటిగాఁ గంటి కద్భుతం • బంటఁజేసె. 52

క. బిట్టు గదుర జనము • పెట్టెడి యుండ్రింపు, కట్టఁ బట్టిమ్రింగు • పొట్టివేల్పు
పట్టుమిగిలి పైకి • ధట్టి ధారుణిఁజుట్టి, మెట్టుగుట్టరీతిఁ • బొట్టదనర. 53

వ. ఇవ్విధంబున వలిమలల్లుని కొమరుండు ముల్లోకంబులకుం జని భక్ష్యంబులు కొల్లగొ
ని వెల్లివిరిసిన యుల్లంబున రంజిల్లు సమయంబున స్వర్గవల్లభులైన సురతల్లజులు
పిల్లతనంబున నిట్టి భక్షణంబు చెల్లునే చెల్లిన లోకంబులు విలసిల్లునే విలసిల్లిన నప్పి
ల్లడు రంజిల్లునే యని గౌరీవల్లభుఁ జేరి తద్వృత్తాంతంబు విన్నవించిన. 54

తే. భాద్రపద మాసమున శుక్ల • పక్షమునను, జవితి యనువాసరంబున • వివిధభక్ష్య
భోజ్యముల పూజగొనుడు నా • పుత్రునీక, దేటికి తరంబొకటి పర్వ • మేటికనుచు

సీ. మృడుని వాక్యంబిట్లు • పడసి శ్రీలసరఁగ, వడవడ గడగడ • వడకు దేహ
జడిమ మానుచుఁ దమ • విడిదికిఁ జనవడి, దడబడుటయు లేక • మృడుని కొడుకు
వెడలి ముజ్జగములఁ • గడుభక్తి నుండ్రింపు, టడలను గుడుములు • నిడఁగ మెక్కి
దొడి దొడి దిరుగుచు • గుడ గుడ బుడబుడ, బెడ బెడ ధ్వనులను • బ్బడరి సడల
కడరు కడుపొప్ప తలిదండ్రి • కడను బ్రొక్కి
పుడమి నదియానితకీన • యొడలు బ్రోయ
బడక బెడగైన బెడిదమై • యడల నరుగ
నుడువిభుఁడు గాంచి నవ్వెసం • దడిగ మ్రోయ. 56

క. ఉడుపతి వడినగ వ్రిస్సిన, కడుఁపున నుండ్రింపు కట్ట • కట్టలు బెడగై
దొడ దొడ బొడబొడ నాదము, లడర వడిగ వడిగఁ బడియె • నవిపుడమి కడన్,

లయగ్రాహి.

మెండుకొని యామిషపు • ఖండములు వేగఁదెగి
గుండెగమి నుండి పెను • కండలూగి రాగన్

దండిగల సద్విరద ♦ తుండములఁ బోలి వెను
తండములు గాఁ బరగు ♦ కుండలుల నెల్లన్
జండభయుఁడై హరిహ ♦ యుండు సుతు కుక్షిపై
నిండుకొనఁ జుట్టిపగ ♦ యుండులుప జేయన్
వెండియు నతండు తన ♦ గుండెగమి గూడి తను
మండనము గాంచి వెను ♦ పండువుగ నుండెన్. 58

తే. నందనుఁడు గంద మజ్జెల్ల ♦ గందఁజేసి, డెందమున కుందు చెందకా ♦ నందమతిని
డిందు నొందని నిరుఁగాంచ ♦ నింపయగుచు, కందువల నెల్లపుడు లోక ♦ బృందమనిన

తే. ఈపగిది శాపమున్న నే ♦ మోపఁ గలమె, కాపుగాఁ జూపు నీచూపు ♦ ప్రాపుకోపు
శాపమున మాన్ప నీయతిరి ♦ పాపనికన, గోప విరహిత మతినిదా ♦ శాపధరుఁడు.

తే. ఈదినంబునఁ గన నింద ♦ పోదు మీఁద, నేదినంబున గన నింద ♦ రాదటంచు
వాదరంబున హరుఁడెద ♦ నూదిపలుక, మోదమతి నేగి రాదితే ♦ యాదులెల్ల. 61

సీ. భాసురగతి కృత్తి ♦ వాసుండు నిజ వాగ్వి ♦ లాసంబుచేఁ బాక ♦ శాసన కమ
లాసనాదుల నిజా ♦ వాసంబునకు నంచి ♦ భాసురగతి మఁద ♦ హాస మొప్పఁ
గా నూనుఁ డరుదేర ♦ వాస్తూను నర్ధ సిం ♦ హాసనంబున నుంచి భాసమాన
మాసతీనిభ చండి ♦ కాసతీ సహితుఁడై, వాసిత పుష్ప కై ♦ లాసగిరి మ
హా సుఖమున నుండె ♦ నీ సకలము గాన, కే సమయమునందు ♦ వాసుదేవుఁ
డోసరక చతుర్థి ♦ వాసరంబున శశి, నాసఁజూడ నింద ♦ దోస మమరె. 62

తే. పొంగి శౌర్యంబుచే యదు ♦ పుంగవుండు, రంగు మీరంగ గరుడ తు ♦ రంగుఁడౌట
దుంగగతి నింగి నిన్నేల ♦ నుం గలిసి య, సంగతిఁ జెలంగు నింద దొ ♦ లంగఁ జేసె.

వ. మఱియు నిందు నిన్నియుందంబులం జెంది ముక్తి స్యందనంబై కథ వెంపొందు గోవిందానంద కందళంబైన నీయిందుధరనందన చరిత్రంబునందు ముకుంద పాదారవింద ధ్యాను లమందీకృత తుందిల భక్తిసందోహులై పఠనంబుఁజెందిన సంక్రందన మందిర నందన హరిచందన నామంద మందార తరు బృంద పుష్పసందోహ స్యంద న్మగందా స్వందేందిందిరా రావంబులం దదవినుచు బృందారక లోక సంద్యమాన మందాకినీ సుందరార వింద నిందక ముఖామర సుందరీ సందోహాశ్లిష్ఠ మరందానుభవమ్ము జ్జైంచు దందశూక శయ మందరధర హిందోళాలకా కృప నొందుదురు ఇంద్రధర

పదవందనములు పఠనంజెందిన నందిప్రముఖులు గొల్వఁ దత్స్థానంబునందుదురు. ఇందువి న్నవింటతి గృపఁజెందింపరే యనిన మునులానంద సందోహంబులగు డెందంబుల మహాత్మా మణికై నందనందనున కెచందంబున నిందసమకూఱె నతఁడు దాని నెఱిత క్రమంబించి మణి నెట్లు చెందించె ననిన సూతుండిట్లనియె. 65

సీ. దైత్యారి కృష్ణుఁడై ♦ ద్వాపరాంతంబునఁ, గంసాదిఖలుల న ♦ ణఁచి రుక్మి
ణీదేవిఁ బెండ్లియై ♦ మోదంబుతో ద్వార, కాపురంబునను శ్రం ♦ గార గతుల
నతుకశాదత్తుఁ ♦ డై యుండ భాద్రప, ద సితపక్ష చతుర్థి ♦ దనరు సాయ
మునవస్త దిశను సో ♦ మునిరేఖ రుక్మిణీ, జాలంబునను గాంచి ♦ జలజభవు
వలన దీని భిన్నదిగాన ♦ వాసుదేవుఁ, డరయఁ దగదని చేలాంత ♦ మడ్డుసేయ
నదిమది నెఱింగి శౌరి దా ♦ నడరులేక, బలికె రుక్మిణి తోడుత ♦ ప్రమద మెసఁగ.

క. శ్రీలలిత నిశాతతి కర, జాలలగద్రత్నసౌధఁ ♦ జాలంబున నో
బాలా మేలా యాలా, హేలా చేలాంచల మిడ ♦ నేలా యనినన్. 67

సీ. అఱుంజముఖి పఱె ♦ చొఱపు లీలల, నఱరిపురికి మా ♦ ఱొఱ నాడు
మఱువతోఁ జన ♦ నొఱఁడు నారదుం, డొఱతజనివచ్చి ♦ యిఱడ మిము
మిఱలి గానక ♦ దిఱిఱని యేగఁబో, నెఱుడు భక్తినే ♦ నిఱఁ జేర్చి
చఱని గద్దియ ♦ నెఱంప గోష్టిచే, ముఱంటి పట్టి ము ♦ న్నొఱ యొడల
నఱజపు రాజితాదిగ్రై ♦ మిఱుటమయి,
మిఱ విరియఁగ భత్యముల్ ♦ మెఱ మెఱ
యఱడు పు తోడ గురులకు ♦ మ్రొక్కు వేళ
నఱుముద భర్త గనఁగుక్షి ♦ ప్రఱలయ్యె. 68

సీ. నందనుఁ బొందిన ♦ చందమయ్యెడఁ గని, కుంది కుందుచు నవ్వ ♦ డిందుమకుటుఁ
డిందుని గను లోక ♦ బృంద మెప్పుడు నిందఁ, బొందునంచును గన ♦ లొంది పలుక
బృందారకాదులా ♦ చందముఁ గనుఁగొని, దంద హూకాళి నం ♦ దండ దెచ్చి
చిందర వందర ♦ చెందిన గర్భంబు, పొందిక నొందించి ♦ భూత విభుని
ముందు సుతుని కందుకులఁ బె ♦ న్నొంద నునిచి
చందమామకు నీనింద ♦ డిందు పఱచి
వింద్వాసఁగె ధాత్రికని సుర ♦ బృందములకు
నందములు జిల్కఁ బఱె ఖా ♦ కెందు మాళి. 69

క. ఇది కృతయుగ వార్తయనుచుఁ, ద్రిదశమునీంద్రుండు చెప్పి ♦ దివి కరుదెంచెన్
అది యీదిన మని మది చెద, రొదవఁ బటాంతమున నడ్డ ♦ ముంచితి ననినన్. 70

క. ఓసరలఁగ నేఁజేయుదు, వాసవ ముఖ్యులకు నింద ♦ వచ్చిన సైసన్
వాపిగ నడ్డంబేమని, యాసోముని గాంచి శౌరి ♦ యలరు మనమునన్. 71

లయగ్రాహి.

మానికపు వేదికల ♦ తో వెలయు బంగరపు ♦ సోనగల మేడల న ♦ మానతర జాతీ
మానములఁ జెంగలువ ♦ పానుపుల తెమ్మెరల ♦ నాను శిబిరంబులను ♦ నీనిచయమందుఁ గా
శ్రీనిలయ యాదవ కు ♦ లీనుఁడగుటందనదు ♦ మానవతిఁగూడితమిఁ ♦ బూనివిహరించెన్
దానములుసచ్ఛ్రుతిని ♦ ధానములు పీతజన,మానములు వైణికుల ♦ గానములు వించున్.

వ. ఇవ్విధంబుననున్నంత కతిపయ దినంబులలోన. 73

ఆ. బ్రధ్నుచేత మణిని ♦ బడసి సత్రాజి దా, హ్వయుఁడు మధుర కరుగ ♦ నంబుజాక్షుఁ
డడుగ నివ్వకుండె ♦ నష్టభారములు గాఁ, బైడి గురియునందుఁ ♦ బ్రతిదినమును. 74

తే. కంఠమున మణిఁ దాల్చి భూ ♦ కాంతు తమ్ముఁ
డడవి కేగంగ మృగరాజ ♦ మతని మ్రింగ
దాని ద్రుంచి మణిని గొంచుఁ ♦ దనదు పుత్రి
డోలపై జాంబవంతుఁడు ♦ వ్రేలఁ గట్టె. 75

క. హరి మణికై మదనుజుని, న్బొరిగొనె ననిరాజు నిందఁ ♦ బూన్పఁగ ధరణీ
ధర గుహలోనికి హరి స, త్వరగతిఁ జనె నడ్డమున్న ♦ దైత్యారి కటన్. 76

వ. ఇవ్విధంబున గుహఁ జొచ్చి కందుకంబుగా బాలికాడోల వ్రేలఁగట్టిన మణిం గొను నెడ దానితల్లి మొరయిడిన నబ్భల్లుకేశ్వరుండా నవనీత చోరునిఁ జోరునిగాఁ దలంచి యష్టవింశతి వాసరంబులు నష్టంబు లేక నిష్టంబులగు నభీష్ట గతులఁ గష్టంబు నొందక ముష్టాముష్టి బాహాబాహి కేశాకేశి దండాదండి కచాకచి నఖానఖిం బోరి శౌర్య దక్షుండైన పుండరీకాక్షుని చేత నాబుక్షాధ్యక్షుండు పక్షంబు గోలుపోయి తదక్షయ తేజోదర్శనాక్షమాక్షుండై విచక్షణ భావంబు సాక్షాత్కరించిన నీ నిట్లనియె. 77

క. భూదేవికి నాత్మజరై, సాదరముగ నీకుఁ జాడఁ ♦ జాయా మణిరై
మోదంబునఁ గదిరెడి నీ, తాదేవియె రుక్మిణీ వ ♦ తంసము సుమ్మా. 78

క. అసమానపుఁ బసచెడ విస, విసగాఁ గసిమసగు నసుర • విసరంబుల మే
లసిఁబూని యసువు లొసలఁగ, వెస కసకస దునుము సామి • వెకద శౌరీ. 79

క. ఖరకర ఖరశర వరముర, కరమునఁ గొని జిరజిర జిర • గా బిరుసాదవన్
జరగక విఱుగక తఱుగక, ఖరుఁ బొరిగొను వాఁడవీవ • కావే శౌరీ. 80

వ. మఱియు వాలికై కిరణమాలి తనయాది కపుల మేలమ్ములతో లయలీలా శూలాయుధ పాలా ఫీలానల జ్వాలాంచిత ధనుఃఖేలా జయశ్రీలా హాలాహాల లీలా శరమాలా తూలాయమాన నానా రక్షఃపాల సేనా జాలంబులుఁగాఁగ నాలంబు సేయుచెడఁ దూలు సింధురంబులును కూలు కంధరంబులును వాలు వాలమ్ములును సోలు ఫాలమ్ములును వ్రేలు వదనమ్ములును వ్రీలు రదనమ్ములును విరుగు మర్మంబులును చిరుగు వర్మంబులును గాఁజాలుపడిన వీచిమాలిఁ గాలి తెరువునఁ బోలుప జాళువాపసిడి చేలంబులు గట్టి ముత్తియంపు భూషణ జాలంబులువెట్టి పూల మాలికలు జుట్టి కేళీసరోజమ్ములు కేలఁబట్టిన శ్రీలతో జేజేలు వచ్చి మేలా నీలాపరిపాల వనమాలి వైన నీకు జాలిమాలి యీలా కోలలఁ బ్రతికూలులం దోలనేలా నీజాలు చాలుఁజాలు మేలు మేలు గోలతో బ్రోలికరిగి భూలలనకు నేలుమగండవై వాలాయమ్ముగా నిల జేజేలఁ బాలింపుచు నిత్య హేలలం దేలు మవవారి యాలాపంబులకు లోలుండవై యాలీల సేయు నిన్నుఁ గౌసల్యకుఁ జూలివౌటెఱుంగక పాలమ్ము గోపాలుండవని నీపాలఁ రణంబొనర్చితి నాపాల గరుణింపు మని మఱియును. 81

తే. నాటి నీతోటి నాటి ము • న్నీట దాటి, కోటులైన నిశాటుల • గోట మీటి
బోటి తోడుత నీమేటి • వీటి నునికి, మాటుపడ కేటఁజేసితిఁ • జాటవలదు. 82

క. అని యిట్లు జాంబవంతుఁడు, వనజాక్షుని వినుతిసేయ • వనజాక్షుండున్
ఘనమణి నిందయు ననుఁ జెం, దిన నీగుహఁ జొచ్చితిని మ • తి న్ననలకనన్.[?] 83

తే. అణువు కన్నను జూడ మ • హాణు వగుచు, గణనకెక్కిన నిన్నుఁ జేఁ • బ్రణుతిఁగొనక
చాణుకు గల్గిన నేరము • ల్చెణికితనని, మణిని గన్యామణిని యదు • మణి కొసంగె.

వ. తదనంతరంబ హరి మిత్ర జ్ఞాతి బంధువర్గంబులు గుహాముఖ నిర్గతుండు గాఁడని చింతించి దుర్గావాక్యంబుల నివారిత శోకులై యున్నంత. 85

క. మణితోఁ బఱిపూర్ణ నిశా, మణితోఁ దగుమొగము గల్గు • మంజుల బాలా
మణితోఁ జనె యాదవమణి • మణితోరణరచిత నగర • మణి కర్యోడలన్. 86

సీ. అకట శౌరి క • న్యాశతమ్ము సహితుండై, తానేగ గద్దాది • మాను లెల్ల
పతికోర్థ గాఁ బెండ్లి • యుత్సవంబు సేయించి, బ్రాహ్మణాశీర్వాద • పఠన మొంద
మణుల సేసలు బలు • మఱు దేవతాదులు, పైజల్ల వాద్యాది • బహుళరవము
ప్రోయుచుండఁగ లగ్గ • మూరొడ సమకూర్ప, హరి జాంబవతికన్నె • నలరఁ బెండ్లి
యాడి తనదు సభకు • నట్టి సత్రాజిత్తుఁ, బిలువ నంపి మణిని • బ్రీతి నొసఁగ
నిట్టి మణికి శౌరి • కెనిడితిని నింద, మీద గతియు నాకు • లేదటంచు. 87

ఉ. తన తనయామణి స్మణిని • దానవవైరికి నొసఁగెడియ్యా న
వ్వనరుహ పత్రలోచనుఁడ • వారిత దోషము చేతఁ గ్రమ్మర
న్జనపతి కమ్మణీంద్రము నొ • సంగి సరోరుహనేత్ర గైకొనెన్
ఘనుల విరోధ మొగ్గగుచుఁ • గన్పడ కుండఁగ రిత్తవోవునే. 88

క. నీవీగతి పడలివ ల, జ్జావైఖరిఁ గాంచు ప్రౌఢ • సరణిఁ బడసితి
స్నీవీగతి పడలివ ల. జ్జావైఖరిఁ గాంచు ప్రౌఢ • సరణి యనంగన్. 89

తే. హరిపదంబునఁ బడి యసు • హానిఁ జెంది
హరిపదంబునఁ గాంచితి • దనుజ నీవు
హరిపదంబునఁ బడి యసు • హానిఁ జెంది
హరిపదంబునఁ గాంచెద • దనుజ రేను. 90

వ. అని డోలాయమాన మానసుండై విచారించుచుండె నంత కతిపయ దివంబులలోన.

సీ. శౌరి సీరిని గూడి • వారణపురి కేగ, కారణంబునఁ జేరఁ • జార గతుల
నక్రూర కృతవర్మ • లనువారు శతధన్వుఁ, డనువానిఁ బొడగని • యాప్తవృత్తిఁ
దనసుతోత్తమను స • త్రాజిత్తు నెడిరాజు, మనలో నొకరికిచ్చు • మతముఁ బూని
హరి కొసంగెను గాన • నాన్నృపుఁ బొలియించి, మణిగొని వేగ ర • మ్మన నతండు
నిదుర వేళ నేచి • చెదర నాతని తలఁ, ద్రుంచి వైచి మణిని • గొంచుఁ బోవ
పట్టి వార్త దెలిపి • హరి యుత్తపురమున, కరిగి యతని ద్రుంప • నురువడింప. 91

ఉ. శౌరి పరాక్రమించి యరి • సంతతి ద్రుంచుట లెల్ల తొల్లి య
క్రూరునిచే నెఱింగి మది • గుంది తురంగము నాహవాఢ్యుఁడై
యూరు దొలంగి రేగె శత • ధన్వుఁడు దూరము వేగ వాతడిం
పారఁగ వానిఁ బట్టి యదు • వల్లభుఁడు ద్రుంచె నుదగ్రలీలచేన్. 92